ఓం

# రాజా చంద్రకుమారి

ఆంధ్రదేశ చరిత్రవిషయక నవల


గ్రంథకర్త:

ఆంధ్రసరస్వతి, విద్యాభూషణ

**మల్లాది వేంకటనాగభూషణంగారు,**

బ్రాహ్మణకోడూరు.



ప్రకాశకులు :

**మాధవపెద్ది రామకోటయ్య,**

బ్రాహ్మణకోడూరు.

**1938**




[వెల 1—0—0]

# పీఠిక.

నాకుఁగల స్వల్పభాషాజ్ఞానముచేతనే భాషా[redacted] దలంచి నవలారూపమున నొకటి రెండుగ్రంథములు వ్రాసి వానినిద్రోసివేసి తేలికతెన్నున నీచిన్నిగ్రంథమును వ్రాసితిని. కొన్నికొన్నిచోట్ల నామములఁ దెలుపునపుడు స్పష్టముగా నానామములు తెలియుట యవసరమని ద్రుత సంబంధ సూత్రమును నుల్లంఘించితి. ఈనవలారచన విద్యార్థుల కగుట చేత నట్లు చేయఁబడినది. ఇది యుపవాచకముగా వాడతగి నదిగాని ముఖ్యపఠనీయ గ్రంథముగా నుండతగినది కాదుగాన నట్లు వ్రాయబడినదని మనవిచేయుచున్నాను. ఉపాధ్యాయులు దానిని విద్యార్థులకు గుఱుతింపఁజేయ వగును.

కథ కొండవీటిది. ఆంధ్రచరిత్రాత్మకము. ఆంధ్రప్రతాపము వర్ణింపఁబడుట నాంధ్రుల కాదరణీయమగుననుట నిస్సంశయము. కొలఁదిలోపములున్న మఱుప్రచురణమందు సవరింపఁబడును. దీని సర్వహక్కులు మాధవపెద్ది రామకోటయ్యగారి కొసంగబడెను.

శ్యామారామాశ్రమం
బ్రాహ్మణకోడూరు
గుంటూరుజిల్లా

ఇట్లువిన్నవించు
ఆంధ్రసేవకుఁడు
మల్లాది వేంకటనాగభూషణమ్.

1-12-37

# ప్రకరణములు.

# రాజా చంద్రకుమారి

## 1. కొండవీడు - పందెపు గుఱ్ఱము

జయ ! కొండవీటి ప్రభువరేణ్యా ! విజయీభవ. కదనవిజయమార్తాండా ! మహాసామ్రాజ్యధురంధరా ! విజయీభవ. తెలుగుదానకర్ణా ! విజయీభవ. శ్రీఛత్రపతి మహారాజా ! అనవేమారెడ్డి భూపాలకా ! విజయీభవా యని వందిమాగధులు కైవారములు సేయుచుండ; యువరాజగు కుమారవేమారెడ్డి వామపార్శ్వంబున నడచుచుండ; మేనల్లుఁడును గోదావరీ మహానదీప్రాంతాంధ్రదేశాధీశుండగు వీరభద్రారెడ్డియు, ప్రధాన సేనాని ప్రతాపరెడ్డియు, వెనుకగా నడచుచుండ; వారి ననుసరించి ఆంధ్రకవిరాజు శ్రీనాథ మహాకవియు, ఉద్దండకోలాహల బిరుదాంకిత షట్ఛాస్త్ర ప్రవీణ మల్లాది నాగదేవరార్యులు, నిడువంకల నలరార గుంటుపల్లి ముత్తయ్య మంత్రి చనుదెంచుచుండ; విప్రులు వేదఘోష యొనర్చుచుండ; జనులందఱు జయజయధ్వనులు సేయుచుండ, శ్రీఛత్రపతి మహారాజ అనవేమారెడ్డి ప్రభువుగారు రాజధానీనగరమగు కొండవీటియందుఁ గొలువుకూటమునకు ముందుభాగమున జిత్రింపఁబడిన మహాపర్ణశాలామంటపమునకుఁ జనుదెంచి సింహాసనాసీనుఁ డయ్యెను.

వామపార్శ్వంబున యువరాజును, వీరభద్రారెడ్డియుఁ బల్నాటి సామంతుఁడు పినవీరభద్రారెడ్డియు నాసీనులైరి. రెండవప్రక్కఁ బ్రధాన మంత్రి ముత్తయ్యయు, మహాకవి

శ్రీనాథుడును, నుద్దండకోలాహలుఁడు నాగదేవరార్యులుఁ గూర్చుండిరి. ప్రభువునకు వెనుకగా నప్పుడే వచ్చిన రాకుమారి చంద్రకుమారియు, రాజసోదరుఁడు వేమన యోగీంద్రులవారు నుపవిష్టులైయుండిరి. ప్రక్కల, వెనుక జనులు వారివారికిఁ దగిన స్థలంబుల నిలుచుండి, కూర్చుండియున్నారు.

గుంటూరునకు నైఋతిదిశను నిరువదిమైళ్ళలో కొండ వీటకొండలు గలవు. ఆ పర్వతములకుఁ బశ్చిమమున కోటయుఁ గొండవీడనియుఁ బేరఁ దనరారు చిఱుపల్లెలు రెండు గలవు. ఒండొంటికి కొక క్రోశముండును. ఈప్రాంతము ఫిరంగిపురఁపు రైలుస్టేషనునకు మూఁడు పరుగు (6 మైళ్ళు) లుండును. ఇప్పటికిఁ దత్ప్రాంతములఁ బొలములలో నక్కడక్కడ ముక్కలైన రాతిగాబులు, రోళ్ళు గాన్పించును. పర్వతముపైన బడిపోయిన ప్రాకారములు, పగిలిపోయిన సోపానములు, విరిగిపోయిన విగ్రహములు, కూలియున్న దాలములు, చిందరయైన మందిరములు, కొండలమందఁ జేయు చంద్రశాలలు, కనులకు మిఱుమిట్లుగొలుపుచు శిఖరముల కలంకారప్రాయమైయున్న బురుజులు, కొండయందే నివసించుట కూహగలిగించు గుహలుఁ, నందంగుఁగల కోనేళ్ళు, బావులు, దొనలు, చూచువారికిఁ బూర్వోన్నత్యమును స్ఫురింపఁజేయుచు బాష్పముల స్రవింపజేయుచుండును.

ఆ శిథిలమహా వీరదుర్గమదుర్గము "ఖాసింఆలీ" యను కవిచంద్రుని నెట్లు చింతింపఁజేసెనో చూడుడు.

సీ॥ ఘనుడెట్టనకవీంద్రుఁ డనయంబు
విద్యాధికారియై యేపీట గణనగాంచ

హర్షు నైషధకావ్య మాంధ్రీకరించి మేల్
కవిగండఁ డేపీట గణుతికెక్కె
నిచ్చి వేమన వెఱ్ఱిపుచ్చకాయలనుండి
బంగార మేపీట బయలుదేరె
వేదాంతవేద్యుఁడై వెఱ్ఱివేమనయోగి
కేపీట వేదాంత మెఱుకపడియె

లభ్యులా దేవతలకే యలభ్యమైన
పరుసవేదికలుండు నీపురి యటంచు
జనవదంతి మహాపీటికిన్ లభించె
నట్టి మన కొండవీడు నేఁ డక్కటకట
కనులఁ గాంచిన దుఃఖంబు గలుగకున్న.

సీ॥ మును రెడ్డిప్రభువులు మొనసి కొలువుదీరు
సింహాసనము చెక్కుచెదర లేదు
నిన్ననో మొన్ననో నిర్మించినట్లుండు
గాని చీకటినూయి కాంతి విడదు
అరిభయావహమైన మరఫిరంగీలుంచు
బురుజులాయవి యింక మురువుసెడవు
నిగ్గుటద్దములట్లు నీడగన్పడుఁ గాని
యూజ్యపుంగోట్లు లింకారలేదు
అన్నిటికి నేమిగాని యన్నన్న ! ఇప్పు
డచ్చ టాకోటయందున్నట్టి నంది
విగ్రహముగాంచి కనుల నీర్వెట్టనట్టి
మనుజుఁ డెవ్వండునయిన నీమహిని గలఁడె ?

క్రిందిభాగమున గోటయను పేటవరకును సోపానముల మార్గమున్నది. ఇంగ్లీషుకాలమున నాకోటప్రాకారములు సంపూర్ణముగ శిథిలము లయినవి. ఈకోటయందొక హిందూ దేవాలయము గలదు. దానిపైని యలంకారము లవలోకనాప్రాయములు. ఒకస్తంభముననే నాల్గుచిన్నస్తంభములు, ఫలపత్రపుష్పసంచయముతోఁ జిత్రింపఁబడుట చిత్రము. చిత్తాకర్షణీయము. ప్రతియాంధ్రుఁ డొకసారి తాను బ్రతుకు కాలమున నాప్రకృతిసుందరమునకుఁ దావగు నాపురాతన దుర్గరాజమున కరిగి యొరిగి విఱిగి నుఱుమాడఁబడి, మొదలకు ముదము, శోకము, వీరముఁ గలిగించు వానిగాంచి, యుద్రేకపూరితుఁడై, నయనసలిలధారల నాపూర్వసౌభాగ్యలక్ష్మీ పాదంబులఁ గడఁగి తనకర్తవ్యమును గురించుట యవసరము. ఇట్టివియే కదా! కొండపల్లి, ధరణికోట, వేంగి, హంపి, ఓరుగల్లు, రాచకొండాది శిథిలనగరములు.

కాకతీయ సామ్రాజ్యము భిన్నాభిన్నములయినప్పుడొక భిన్నమునకు దొంతి అల్లారెడ్డి ప్రభువయి అద్దంకిని రాజధానిగాఁ గలిగియున్నాఁడు. ప్రోలరెడ్డి యితని కుమారుఁడు. వీరివద్దనే మహాభారతపర్మాత. కవిత్రయమున గడసారిమేటి, హరివంశకర్త, శంభుదాస బిరుదాంకితుఁడు, శంభుదాసు, ఎఱ్ఱాప్రగ్గడ సన్మానములంది యాస్థానకవియై యలరారినది. ప్రోలరెడ్డికుమారులే యనపోతారెడ్డి, అనవేమారెడ్డి, యోగి వేమన. వీరి బాల్యముననే యద్దంకినుండి కొండవీడునకు రాజధానిని మార్చినది. కొండమీదనే యవక్రవిక్రమమును బ్రకాశింపఁజేయు దుర్భేద్యదుర్గమ దుర్గమును

నిర్మించినది. కొన్నికొన్ని యసామాన్యదుర్గములు పర్వతము నకు ముందునఁగూడ బంధింపఁబడినవి. శిఖరముల మధ్య నున్న బయళ్లు మెట్టపల్లములు చదును గావింపబడి,యపూర్వ శృంగార మొందుచేసి చెరువు నేర్పరచిరి. దానినే వెదుళ్ళ చెరువందురు. దానికి నలుప్రక్కల వెదుళ్ళగుమ్మ లుండుటచే నానామధేయము గలిగినది. తన్నాగరుల కానీరంబులు చాలును.

పూర్వశృంగమున విచిత్రముగ శృంగారబురుజు నిర్మింపఁబడినది. దానికిఁ గ్రిందుగా ఇంద్రద్వారమను తూర్పు గవిని తీర్చి కట్టఁబడినది. ఈద్వారమున బయలు వెడలు లోయమూలమున తూర్పుప్రక్కనున్న ఎనమదల మొదలగు పుణ్యక్షేత్రములఁ జేరవచ్చును.

ఈకొండకు నుత్తరభాగమున నక్షత్రబురుజు నిర్మింపఁ బడియెను. దీనిపైన నక్షత్రశాలయుఁ గలదు. ఈశిఖరమున కీశాన్యమున కొండపల్లిద్వార మున్నది. అట నిలుచుండి చూచిన గొండపల్లికొండలును, సూక్ష్మయంత్రసహాయమున ధరణికోటయుఁ గాన్పించును. మహోన్నతమగు నక్షత్ర బురుజున నిలుచుండి చూడ్కిని బఱపినచోఁ జింతపల్లి, గుడి మెట్టకోటలు కనుపించుచుండును. పల్నాటినిగూడ భూత యంత్రము చక్కగాఁ బొడసగాపును. కొండపల్లి గవినినుండి బండ్లు వచ్చిపోవుట కనుకూలముగ నటనుండి యుత్తరమునకు వ్యాపించిన గుట్టలపైగా నుత్తరముగా వ్యాపించి యటనుండి పశ్చిమముగా గుట్టలఁదిగుచు దిగువ కొండవీడుగ్రామమునకుఁ బశ్చిమముగా నేలను జేరుచున్న నొకరాచబాటయుఁ గలదు.

పై కోటకుఁ బశ్చిమ దిశను క్రిందికోటకువచ్చి పోవుటకును తగు విశాలములగు సోపానములు నిర్మింపఁబడియున్నవి. ఈ మార్గముననే గోలకొండ గవిని గలదు. సోపానములక్రిందఁ గోటయు, బలిష్ఠమైన యగాధ పరిఘయుగల్గి, రాజకీయ వ్యవహారాలయములు గల్గి విలసిల్లుచున్నవి.

గోలకొండ, కొండపల్లి, యింద్రద్వారములకు విశాల రాజబాటలు నిర్మింపఁబడియున్నవి. ఒక మార్గము పూర్వ శృంగమునకుఁ దూర్పుగా వ్యాపించియున్నది. ఈ ప్రాంతములయందే రాజభవనములు, సభాస్థానములు, శస్త్రాస్త్రాగారములు, మందుకొట్లు, కోటపై జనులకు, సైనికులకు నలయు నేతిని నిలువఁజేయు నేతికొట్లుగలవు. ఇందుఁ గొన్ని చెక్కుచెదరనివి యిప్పటికిఁ గనులకు మిరుమిట్లు గొలుపుచుఁ దళదళ మెరయుచున్నవి. ఈ ప్రాంతమున రాతిగోడలు చుట్టు నిర్మింపఁబడి, చిత్రలతాసహిత స్తంభంబులు మధ్యఁగలగి, వానిపై వెడల్పగు రాతిపలకలు పరుపఁబడిన విశాలమగు కొలువుకూటము నిప్పటికిని జూడనగును.

వెదుళ్ళ చెరువునకుఁ బశ్చిమమున నేనుగుల మహాలని పిలువఁబడు నొక యున్నత శిఖరము గలదు. దీని క్రిందుగనే గజశాల లుండుటచే నీశృంగమున కీ పేరు వచ్చినది. ఇది యెక్కుట దుర్ఘటము. దానిపై నిర్మింపఁబడియున్న సన్నని మెట్లసాయమున నాశిఖర మెక్కఁజాలినవాఁడు వినుకొండ ప్రాంతముఁ గాంచఁజాలును.

వీని యన్నిటితోపాటు మిరియాల తక్తని బిలువఁబడు బెడిదమగు నాకొండ కోన చూడఁ దగియున్నది.

శాలివాహనశకము 1314 (క్రీ. శ. 1392) కాలమున ఓపికేఁ బ్రభువులు అన వేమారెడ్డి, కుమార వేమారెడ్డి యను వారు. వారి లిరువురు, రాజు, యువరాజులుగా నుండువారు. అన వేమారెడ్డికి 67 సంవత్సరములు. కుమార వేమారెడ్డికి 34 సంవత్సరముల యీడు నుండును.

అన పోతారెడ్డి పరలోకమున కేఁగినపిదప నతని కుమారుడు కుమార వేమారెడ్డి పసివాఁడైనందున, అన వేమారెడ్డియే రాజ్యమును పాలించుచున్నాఁడు. కుమారగిరిరెడ్డి రాజావనుఁడైన పిదప యువరాజు పట్టాభిషేక మందియుఁ బినతండ్రి యుద్దేశ్యమునకు భిన్నముగా సంచరింపలేదు.

అన వేమారెడ్డికి నను సదుద్దేశ్య ముండుటచేత నే రెడ్డి రాజ్యంపుఁ గీర్తి విస్తరింపఁజేయ నూహ గలిగియుండుట చేతనే వారిరువురే పోరపులేక చరియింపఁ గలిగిరి. మరియు అన వేమారెడ్డి కీర్తి కుమార గిరిరెడ్డికి నీర్ష్యాజనకముగ లేక యున్నది. కీర్తికాములగు వారి చరిత్రము లిఖియుండును. అందందు దానాదుల యందుఁగాని, శాసనముల యందుఁగాని వారిరువురిపేరు లుండుచునే వచ్చుచున్నయవి. అందొకొటి యీ గ్రంథాంతమున మచ్చునకై కొంతభాగము సూచింపఁ బడియెను. చదువరు లది చూడనగును. అట్టి వారు మృతజీవులే గదా? ప్రజాక్షేమమునఁగాని, ప్రజానురాగమునఁగాని రాజ్యములు చిరస్థాయిగా నుండవని యెఱింగిన వాఁడగుట, జనుల వాంఛలుఁ దీర్చుటకు వెనుకంజవేయక వారియందుఁ దనకీర్తి, మంచితనము వ్యాపించుటకై విద్వాంసులఁ గవులఁ బండితులు, మల్లుర మొదలగువారల రప్పిం

చుచు, జనుల కుల్లాసము గల్గించుచు, లలితకళల, సాహి త్యాది విద్యలం బోషించుటకు నెనుదీయకుండెడి వాం(ఛ). లన వేమారెడ్డి కొన్ని పందల యగ్రహారము లొసంగెనన్న యాతని యౌదార్యకీర్తి, విద్యాభిమానములు వెల్లడియగుట లేదా !

ప్రతి శాఖయు నొక పరిశీలనాధికారి క్రిందనుండి పాలింపఁబడు చుండెడిది. గరిడీశాల లెన్నియో గలవు! అనేక స్థలములనుండి వస్తాదులువచ్చి, కసరతుచేయుట, కుస్తీపట్టుట, యినుపగుండ్ల విసరుట, యినుప కడ్డీలనువంచుట, మొదలగు పనులను చేయుచు బిరుదుల, బహుమానములం బడయు చుండువారు. ఈ శాఖకు గొంది అంజయ్య యను కమ్మ దొర ముఖ్యుడు.

మరియు నటకు విద్వాంసులు, కవీశ్వరులు, భట్రా జులు, నట విట గాయకాది బృందము చనుదెంచి, తమ యపూర్వ విద్యాకౌశలముచే జనుల కమందానందము గూర్చి మన్ననల నందువారు. ఈశాఖకు మహాకవి శ్రీనాథకవి సార్వభౌముఁడు ముఖ్యుఁడు.

పండితులు, సకలశాస్త్రవేత్తలు, నిగమాగమాది నిష్ణాతలు, పరాపరకర్మవిద్యావేత్తలు, పలువిధభాషాభిజ్ఞులు, వేదాంతులు, సన్న్యాసులు విచ్చేయుదురు. వారల సన్మానింప నుద్దండకోలాహల బిరుదాంకితులు మల్లాది నాగదేవరార్యుల కృత్యము వివిధవిద్యాప్రణేతలు, స్త్రీలోకమునందున్న వారిని గౌరవించుట రాకుమారి చంద్రకుమారిబాయిగారి వంతయి యున్నది.

యోధుల, యోధకార్యముల, సరిహద్దు సంరక్షణాధి కార్యములు ప్రతాపరెడ్డి కృత్యములు. రాజ్యపాలనాది కృత్యము లన్నియు మహామంత్రి గుంటుపల్లి ముత్తయామాత్యుని పరిశీలనమందు నుండును. అందఱును విశ్వాసపాత్రు లగుటచేతను, నన వేమారెడ్డి కెవ్వరిపైన నవిశ్వాసము లేకుండుటచేతను, సదా వేమనయోగీంద్రులు ధర్మాధర్మము లెఱిగించువాఁడగుటచేతను, నన వేముని జన్మము సార్థకమైన ద్రవగలుచున్నది.

ప్రతిసంవత్సరము జరుగుచున్నట్టులే విద్యాపరిశీలన యీ సంవత్సరమునను జరిగినది. అన్నియు ముగిసినవి. క్రిందటి దినమున నొక పంచకళ్యాణి గుఱ్ఱము సకలసులక్షణాన్వితము, గంభీరము, సుందరము మదకాంభోజమును చిన్నపు రెడ్డియనువాఁడును, దానికాసావాఁడుగా చరించుచున్న రామానాయుఁడును దెచ్చియున్నారు. అది పందెపు గుఱ్ఱము. కుమారగిరి, సింగభద్రారెడ్లు దాని నధిరోహింపఁజాలక పోయిరి. నేటిసభారంగమునకుఁ జిన్నపురెడ్డి, రామానాయుఁడు హయసమేతులై చనుదెంచి జోహారొనరించి యనుజ్ఞ కోరి యిట్లనుచున్నారు.

చిన్న॥ ఈ యశ్వ మధిరోహింపువారు లేరా? ఎవరీ యశ్వము నారోహించెదరో వారిని సేవించియుండువాఁడను. దీని నెక్క యేరాజేంద్రుని యాశ్వికసైన్యమందుఁ జేరుద మన్నను స్వారిచేయఁజాల. ఇట్టిదాని నెవ్వ రెందులకుఁ గొందురు. నా కోర్కె తీరదా?

రామా॥ దీనిని రాచకొండనా రధిరోహింపలేరైరి.

అనేక సామంతులు ముట్టఁజాలరైరి. ఇంక నీపీటియం దిట్టి వారు లేరా ? మమ్ము వెళ్లమందురా ?

గొంది అంజయ్య॥ రాచకొండ సామ్రాజ్యమునందలి సామంతు లందఱు దీనిని గాంచి తొలఁగిరా ?

రామా॥ అందఱును వెనుకంజవేసిరి. మేటిసూరు లున్నారీపీటనని పిసి చనుదెంచితిమి.

గొంది అంజయ్య॥ చేతవోలుసీమాధిపతిని గాంచితిరా?

రామా॥ ఆలోచించెను. నామాన్యముగా స్వారి నహించెను ఇతఁడు రెడ్డియగుటచేత నీతని కొలువంగీకరింపక పొమ్మనియె.

అన వేమారెడ్డి॥ ఈశూరలోకమున నీసాహాణిని స్వారీ చేయువారే లేరా ? అపకీర్తి కలుగునా ? సభయంతయుఁ గలతపడుచున్నది. ఆకాశమును, నేలను జూచుచున్నారు. ఇంతలోఁ జంద్రకుమారి లేచినది. ఆమెను యోగివేమన నొషవిభూది నుంచినాడు. నడుము కట్టినది. హాయమును నమీపించుచున్నది. వీరరసావతారమును జూచి జనులు విస్మయమందుచున్నారు. గుఱ్ఱమును బట్టినది. తట్టినది. అంకెమున గాలుంచినది. ఎగిరినది. జయ్ దుర్గాభవానీ జయ్ రాజకుమారికి జయ్ యనుచున్నారు. ఆగుఱ్ఱపుకానాయేయుని యందఱు తలంచు రామానాయఁడా రాకుమారిని, స్వారిని తీవ్రదృష్టిని జూచుచున్నాఁడు. తల పంకించుచున్నాఁడు. మీ చేక మఱచుకొనుచున్నాడు.

## 2. రామానాయుఁడు, దురాలోచన.

చిన్నపురెడ్డి నమ్మినబంటు. విశ్వాసపాత్రుఁడు. యజమానునికి ప్రాణమునైన నొసంగును. నూరువరహా లొసంగఁబడి గుఱ్ఱము కొనఁబడియెను. ఆతనికి నెల కేబదివరహాల జీతము. హయపోషణ యాతనిదే. వలయునప్పుడు యువరాజు, రామనూరి, చిన్నపురెడ్డియే, రామానాయఁడును నాలోచించుచుందురు. రామానాయఁ డా పందెపు దినము నుండియుఁ జిన్నపురెడ్డికి సామాన్యాను చరునివలెనున్నాఁడు. గుఱ్ఱమున కొక మనుష్యుని కుదుర్చికొనినారు. కాని రామానాయుఁడు గుఱ్ఱము వెనువెంటనే యుండును. నగరమునందుఁ గోటలయందుఁ గుమారగిరి వేమారెడ్డి ననుసరించి సంచరించుచున్నాఁడు.

చిన్నపురెడ్డి గృహంబున వాకిలి మూసియున్నది. మంచముపై రామానాయఁ డుండెను. అతని పాదంబుల నొత్తుచు చిన్నపురెడ్డి నేలగూర్చుండియే వినయభయభక్తులు గదుర నిట్లనుచున్నాఁడు. తీవ్రదృష్టులయుం దున్నారు.

చిన్న॥ దేవా! ఇప్పుడేమిచేయ ననుమతి యొసంగెదరు?

రామానాయఁడు॥ కోటినాయఁడా? కాదు కాదు. చిన్నపురెడ్డి! ఈరెడ్డిచిన్నదాని కోడితిసుమా!

గుఱ్ఱఁపుస్వారీయందు మేటియని పరిపాటిగాఁ జెప్పకొనబడు బేతవోలు (జగ్గయ్యపేట, కృష్ణాజిల్లాలోనిది) నేత చేతకాలేదా? యనిచేతమున గర్వము గదుర పలువరించినది. అది మదికిఁ జెమటపాటు కలిగించినది. ఆమెకడ సాహసం

గమును నేనో, నీవో తెచ్చునపుడు నన్ను నీచుఁడనియు, భీరువ యనియుఁ జపలుఁ డనియు, శీలరహితుఁ డనియు, నల్పహృదయుఁ డనియు నాలకించుచున్నామని, తానొక యున్నత జాతి జాతవోలెఁ గూతలాడుట నాలింపవా? ఔరా! ఆబోటి కింతటిపనిటు. బేతప్రోలునేతనై రాజకొండరాజ్యస్థమహా శూరుల నొకండనై జగద్విఖ్యాతభుజాబలుండనయిన యీ రామానాయుఁడ నొక రామామణితో (బాలమాలి)యైన యూరకుండ రాని పోటీపడనలసి వచ్చినదిగదా! అవగాని కాపర మణచుట కుపాయమేమి?

అదియటుండ నేను రాచకొండరాజుల నాశ్రయించినది వీరికి భీతిలియఁట. తాము మాటిమాటికి రాచకొండరాజులతోఁ బోరాడవలసియుండుట ప్రజాక్షేమంకరము గాదనియు, వారికిని, తనకు నొకచిన్నరాజ్యముండమున్నచో నుభయులు భయరహితులై నుచితరీతినుండ ననువగుననియుఁ దలంచి, తమ యిరువురి పొలిమేరలమధ్య నిభీమనను(తన్ను జూపుకొని) మెలఁగ నిచ్చిరఁట. నేనఁట జనుల వంచించితినఁట. జార, చోర, జూదాది వ్యసనముల రాజకీయరక్షణ చట్టముక్రిందఁ జేర్చి వానిని పోషింపుచు దేశమున లలితకళాభివృద్ధి బెంపొందింపుచుండ నిది యవినీతిమార్గమట. కాలమువచ్చిన కూలుదు నఁట. రాజాభిప్రాయమఁట. రాకుమారినోట వెలువడెనఁట.

చిన్నపురెడ్డి॥ అనవేమారెడ్డియే యనెనా?

రా॥ నా॥ అతఁడు సూచించెను. యావనగర్వాతిరేకమున గన్నుగానని యాతని కుమారెడ్డియే యనినదఁట.

చి॥ రె॥ ఎంతమంది స్త్రీలులేరు. వారిట్లు స్త్రీపురుషాదివ్యవహారవ్యవస్థ వదలియుండిరా? రాజస్థానములందు ప్రభువులతో సమముగాఁ గూర్చుండుట, రాజకీయవిషయములందు విషయప్రవేశము గలిగియుండుట, పురుషులగు వారికిని భరింపరాని సిగ్గుచేటు.

రా॥ నా॥ రాచకొండవారు, కొండవీటిరాజ్యమును జయింప ననువుజూచు మనియు, వలయుప్రయత్నము లొనరింపుమనియు నెన్నియోసార్లు దెలిపియున్నారు. అందులకు వలయు ధనమంపిరి. కోరినసైన్యవారము లవారిగఁ జనుదెంచును. వారి రహస్యచారముఖ్యుఁడు మఱల వచ్చిపోయెను. ఈదుర్గము జయించుట కుపాయ మన్వేషించుటకే గదా యీ కాసావేషము. చేతవోలు నేతనగు నేనేడ? ఈ కాసాయుద్యోగ మేడ? ఒకపరి చంద్రదర్శనముగూడఁ జేయవలసివచ్చినది.

చి॥ రె॥ కార్యార్థుల మగు మనకది యకార్యమగునా? దేవా!

రా॥ నా॥ అది యేమియో? ఆమె యశ్వారూఢయై యుండ నాపెయుండ నుండుట, నెదుట నిలిచియుండుట, కన్నారగాంచుచుండుటలో నేనొక ప్రభువుననియు, రహస్యమార్గాన్వేషిననియు, మఱచి, దేహమేమఱచి తన్మయుఁడనగుచు నుండును. నాలోలాక్షిని వీక్షింపుచుండ నానందదాయకమగుచుండు. చూడనిరోజున వేడుకలేక నోవుగ నుండు. ఇన్నియేల? తప్పక యామెను వివాహమాడ మనసగుచుండును. అందులకును బ్రయత్నింపవలయును. ఇందలి కోటల, పేటల పటములు వ్రాసి పంపవలయును. తగువారిని

సాహించుము.

చి॥ రె॥ దీనిని జయింప దుర్లభమని తోచు. ఇతర రాజ్యములందుకన్న నిందున్న సైనికులకు సంబళము రెండు సరిగ నిచ్చుచుందురు. ఈప్రాంతమం దెక్కుడు శైవులు. మన యుద్ధము వీరవైష్ణవ, శైవయుద్ధములుగఁ గూడ మార నగును. మఱియు వీరందఱును ప్రతిదినము రణమునకు సిద్ధమై యుందురు. వారు సంగరమునకు రానున్నారు. వీరు రణమున కాయ తమగుచున్నారను వారల రుగుదెంచుటచే, నెప్పు డును రణోత్సాహమున నుందురు.

రా॥ నా॥ అన్ని ప్రదేశముల నీపగిదినే యుండును ఈరాష్ట్రమున కాయువపట్టు రెండు మూడు కోటలు. ప్రదే శములు: చింతపల్లి, కొండపల్లి కోటలు. పల్నాడు, రాజమ హేంద్రవరము, అసంకియును.

చి॥ రె॥ ఇందలివారలకు యోగమన్న, యోగులన్న వేదాంతులన్న, జడదారులన్న, మహిమలన్న, నాకుపసగు లన్న ప్రేమ. అట్టివారనిన నమ్ముదురు. ఆమార్గమున గాక యన్యమార్గమున నీదుర్గమదుర్గమును ప్రవేశింప దుర్లభము.

రా॥ నా॥ ఆపెను వివాహమాడవలయునని యుల్ల ముయ్యాలలూగుచున్నది. తగువిద్యాంసుఁబంపి యత్నించిన-

చి॥ రె॥ వారు నీ పేరనిన నేవగించుకొనుచున్నారని తెలియునుగదా—ఆయుంగన హంగురంగులు నింగి నంటును గదా? సామాన్య సీమాధిపతులగు మిమ్మా మహారాజఛత్ర పతి తనూజాత తలంపఁ దనుట తథ్యము. మీరు ప్రయత్నిం చుటయు వారనంఘటయు వ్యర్థము. మనయంతట మనమే

వారి కోపపు జూపు మనపైకిఁ ద్రిప్పనవారి మగుదుము. అది యునుగాక తమరు వారి ప్రత్యర్థి సామంతులు.

రా॥ నా॥ ఒకవేళ బంపనచో?

చి॥ రె॥ రసాభాసమగు జవాబు రాగలదు. వెంకటరత్నచౌదరిని రాచకొండవారి వారను దెలుపనంపితిరిగదా? రెడ్డి ప్రభువు లేమనిరి?

రా॥ నా॥ కాకతీయసామ్రాజ్యరక్షకులు తామనియు, నా రాజ్యమును నేకచ్ఛత్రముగఁ జేయఁబూను తమకుఁ గప్పము గట్టుట ధర్మమనియు, వెంటనే పంపుడనియు, రాచకొండవారి రాయబారమును దెలుప, నందులకు ననవేమారెడ్డి యీలాగు ప్రలాపము లాడెను. ఇంతవర కెవరికి దొరకిన ధరణిని వారు పరమశాంతముతోఁ బరిపాలించుకొని కాలము దొరలించుట శ్రేయస్కరమనియు, వ్యర్థముగా నర్థమును వెచ్చించి యనర్థహేతువగు యుద్ధముల నుద్భవింపఁ జేయుట బుద్ధిగాదనియు, నొద్దికమీరియుండుట పురాభివృద్ధికి భద్రమనియు, నదియపాలక, పాలితులకు సుకాలమనియు, భాషావ్యాసంగముల జనాళికని తనకును కీర్తినొదవించు పనియనియు, వీనిని దృణీకరించి రణమున కేగఁ బూనుకొనిన మాటిమాటికిఁ గాటకములు గలుగుననియు, ధనాగారములు శూన్యములగుననియు, వానిని నింపుటకై దేశవాసులపైన నదనపుశిస్తులు వేయవలసివచ్చుననియు, పైవానితో నున్న వానికిఁ గూడ వసూలు గాకపోవుటచే జనుల చెడిదముగ బెదరించి బాధించి వసూలు చేయవలసివచ్చుననియు, ప్రజలు వ్యతిరేకు లగుదురనియు, యలజడి గలుగుననియు నిడి

సందుగఁ జేసుకొని యుద్యోగులు రైతులపై స్వారి వెడలుదు
రనియుఁ, బ్రాతపగలు దీర్చుకొనుటకు వలయు పన్నాగములు
పన్నుచుందురనియుఁ, దనవారు తన విరోధులయందుఁ జేరి
తనకే పతనకారకు లగుదురనియును, ధనాగారములు శూన్య
ములగుటచే సరిగ సంబళములఁ జెల్లింపఁ జాలమనియు,
సందుచే సైనికులు విముఖులగుదు రనియు, సరిగ పను లొన
రింపరనియు, లంచగొండులయి పరులను వారికిఁ బంచి
నొసంగెదరనియు, నిది యదనుగ గైకొని మూడవవారు
మసలఁ గసిమసంగఁగఁ జేయుదురనియు, మనవంటి సర్దారు
లెందరో నున్నప్పుడు వీరప్రతాపరుద్ర భూపాలుఁడు వేలకొల
దిగ వచ్చుచున్న తురకల దండు నతిక్రమింపఁ జాలక కాక
తీయ సామ్రాజ్యమును బోగొట్టుకొన లేదా యనియు, మన
మారాజ్యమం దొకభాగపు వారమేగదా యనియు, శాంత
మున యోచింపుమనియు, నీకు గోలకొండ తురకలపోటి
యటుండఁగా నిటుమాతో యుద్ధమేలననియు, నింతవరకు
భూమి నాక్రమించుకొనియున్న మాజోలికి రాకుండనుండిన
నీకును, సకలాంధ్రావనికిని వికలత్వము రాదనియును, మా
పైకి నీవు చనుదెంచులోపలఁ గాకతీయ సామ్రాజ్యమంతటి
మహోన్నత స్థానమును భిన్నాభిన్నములు చేసిన కరకు
తురకల పరవడులకు రాచకొండ పీచమడంగుట నిజమనియు,
నీరాజ్య మాక్రమింప నిన్నాసరించుట మా యుద్దేశ్యము లేద
నియు, లేనిపోని కలహములకుఁ గాలు దువ్వాకుమనియు,
మేము నిరంతరము రణరంగములకు సిద్ధముగా నుందు
మనియు, నీకు భయపడుట లేదనియుఁ బాలక పాలితుల

యోగక్షేమముల విచారించుచున్నామనియు, నెన్నియో నీతు లేకరుప్పఁ బెట్టెను.

చి॥ రె॥ దూరదర్శియగు నా భూరమణుని యాలోచన శ్రేయస్కరము. నీతి పూరితము. దేశ క్షేమానుకూలము. అంతుచేత నే పూర్వాంధ్రము “తిరుపతి, జగన్నాధ మధ్యస్థమును” స్వాధీన పరచుకొని జనస్తోత్రముల కాలవాల మగుచున్నాఁడు. అట్టి మహారాజుతో, బలియునితో, ధనవంతునితో, కీర్తివంతునితో మనకు శత్రుత్వమేల ? మన కపకారము వారేమొనర్చిరి ? మనము తొలఁగియుండుట యనువగును. ప్రయత్నము విరమించుట మేలగును. రాచకొండ ప్రభుప్రులకుఁ గబురంపుట సరియగునని. తిని కూర్చుండలేక మితిమీరిన యాసలతోఁ దిప్పలు దెచ్చుకొననేల ? విచ్యాక తిని నొచ్చించుకొను వారుందురా ? మరియు నీ యభిలాషతో పాటు తోయజాక్షిపై మమకారమున్న వచింపసలవిగాని పాట్లు పడవలయును. చంద్రకుమారికన్న సుందరులు మీ యంతిపురమున లేరా ? ప్రతికార్యమును సాధక బాధకముల విచారించి చేయుట మంచిదని మనవిఁ జేయుచున్నాను. దొరలదయ.

రా॥ నా॥ కాని రాచకొండ కోటలోఁ గొండవీటిని స్వాధీనపరచుకొనజాలిన వారెవరు? వలయుధనము జనము నొసంగుదమనిన నాఁడు నేను ప్రయత్నించి లోఁబరచుకొందునని వచియించి, ధనముదెచ్చి కార్యక్రమము సాగించుచుఁ గొంత జరిగినపిదప నట్టిదానిని విడిచిపెట్టుట, చేతగాదని తెలియఁబరచుట నీతిగాదు. చావ్రా, బ్రతుకో, కీర్తియో,

యనకీ గ్రహో, జరిగితీరవలయును. మరియు నావరాంగన గర్వ మూడ్చవలయును. పరిణయ మాడవలయును. మున్ముందు నా పెను నాకోటకు జేర్పవలయును. నీకు సహాయమును దేవరరెడ్డిని, యాతని యనుకూలురను బంపెదను యత్నించి చూతము.

---

## 3. నాదెండ్ల అవమానము

కొండవీడును, కోటప్పకొండకును మధ్య నాదెండ్ల యను గ్రామము గలదు. ఇది పూర్వకాలమునుండియు విఖ్యాతి నందియున్నది. శూరాగ్రేసరు లిందు జన్మింపలేదు. కోటలు పేటలుగలది కాదు. రాజధానీనగరము గాదు. పుణ్యక్షేత్రము గాదు. పుణ్యతీర్థములు లేవు. గొప్పయోగులు లేరు. కాని యొకకాలమున నా గ్రామము ప్రజాసముదాయమునకు నాయకత్వము వహించి వన్నెగాంచి యున్నది. ఆగౌరవమును ప్రభువులు చాలాకాలమువరకు గౌరవించిరి. నేటికి నాగౌరవము కొలదిగనైన నిలచియున్నది. దానిని నాదెండ్ల యని వాడుచుందురు.

రాజరాజనరేంద్రుని కుమారుడు కులోత్తుంగచోడ దేవుడు ద్రావిడదేశమున మేనమామ రాజచోడుని యనంతర మాసింహాసనము నధిరోహించి తంజావూరియందు నివసించుచు నాంధ్రదేశపాలనమును, దనదుపురము (గుంటూరు

జిల్లా చందోలు) నందు నివసించి వెల్నాటిసీమను బాలించు చోడులకు నొప్పగించి వారిని రాజప్రతినిధులుగాఁ జేసిన కాలంబున వారు భూమిశిస్తును బెంపుఁ జేసినకారణమున, జనులయందు దళజని యెక్కువయ్యెను. జనులు మహాజర్లను బెట్టుకొనిరి. మన్నించువారు కానరారు. అటనట కొన్ని భూములు పండలేదు. పండకున్నను కాపులను ధాన్యము దాచుకొనిరని బాధింపసాగిరి. ప్రాతధాన్యమున్న గొలువు మనిరి. దానిపై దేశమున గలవర ముదయమయ్యెను. నాయక విహీనులగు నరులేమిచేయగలరు?

మనదేశము సంఘసంఘములుగా వివిధవృత్తులతో నిర్మింపబడియున్నది. ఈవృత్తులవలన సంఘమున కొక్కొక్క పనిచేయువారు తమకృత్యము నెరవేర్చుచున్న సకల సంఘములు సుఖముగాఁ జరియింపగలవు. ఒకజాతిని నింకొకజాతి యడంచిన నాజాతి కట్టుకట్టిన సంఘమంతయు నవస్థలపాలగుటచేత సమ్మెజేయు జాతికోర్కెదీరును. ఇట్టి సాంఘిక కట్టుబాట్లచే, సాంఘిక సమ్మెలచేత నీ భారతచక్రము, రాజ్యచక్రము, సక్రమస్థితిగాఁ దిరుగుచుండును. ఇదియే నాదెండ్ల కమ్మవారు నల్లబోతువారు గ్రహించినది. పూని నూనరాదు. జనులు కట్టుకట్టిరి. పిలిచిన పలుకువారు లేరు. ప్రభువులకే కష్టము కలిగినది.

ప్రభువులు కొండవీడులలోనుండి దిగివచ్చిరి. ఆలోచించిరి. ప్రజాభీష్టమును గమనించిరి. మీకోరినరీతి పరిపాలించెదమని వాగ్దాన మొసంగిరి. జనులకు సంతోషమయ్యెను. రాజీనామా నిచ్చినవారికి రాజు లుద్యోగము

లిచ్చిరి. దేశము శాంతిలెను. ప్రజలకోర్కె దీరినది. జనులు లేనిరాజ్యముల రాజులిట్లేలెదరు. ఐకమత్యముగల్గిన ప్రజలు చేయఁజాలని కార్యమేమున్నది? నాటినుండియు నాజండ్ల నల్లబోతువారికిఁ ప్రఖ్యాతి. అట్టి చరిత్రాత్మకమైన పురమా నావెండ్ల.

నాటినుండియు నాగ్రామమున నెవ్వరు గుఱ్ఱమెక్కి వెళ్ళరు. అట్టిగౌరవమును సంపాదించికొనిరి. ఆయూరివారైనను బెండ్లికాలమందైనచో నధిరోహింతురు. పరులైన నెక్కనిత్తురు. అట్టి గౌరవభాజనములతో నలరారువారి నెవరవమానింతురు? కొండవీటిప్రభువులు నామర్యాదను బాటించుచున్నారు. గ్రామమధ్యమునను రావలయున్నవారి సంబాధీ యేనుగులు లేవా? పల్లకులు లేవా?

ఇది చిన్నపురెడ్డి విచారించినాఁడు. తాను కొండవీటి మేటులలో నొకఁడు. రాజ్యాంగసంబంధి. పురి వీధిగుండఁ దురగముఁ బోనిచ్చినచో నాజెండ్లవారి గౌరవభాజనమునకుఁ గొఱంతగల్గును. దానిపై నాజండ్లకమ్మవారికి, రెడ్డిప్రభుత్వము వారికి మనస్పర్ధలు గనిపించును. క్రమక్రమమున నా మనోవ్యతిరేకముకమ్మ, రెడ్డిసంఘములపూఁదరి దేశమందంతట వ్యాపించుటనిక్కువము. ఈ రాజ్యమునందుఁ గమ్మవారిగుము లెక్కుడు. కమ్మవారు, అందు నాజండ్లకమ్మవారు, సమ్మె కట్టు సొమ్మువారు. అట్టిసమ్మెయొకటి కట్టినచో నీరాష్ట్రము రెడ్డి, కమ్మ కల్లోలముచే కలతపడును. ఆయదనున బేత వైరాలునేతి యీ ధాత్రీశునిపైకి దాడివెడలినచో తెక్క తెగినపక్కిఫక్కి, స్రుక్కి, పొక్కి యికొండవీడువారుక్కడం

గుదురు. మఱియుఁ గమ్మదొరలలో నొకనికి సామంతత్వ మిచ్చినచో నిచ్చటి కమ్మవీరులందఱు, మా రామానాయని సైన్యము క్రిందుఁ జేరి యీ ధరారమణుని బోరిఁగొందురు. ఇదియ చిన్నపురెడ్డిమదికిఁ దగిలిన తలంపు. అద నెప్పుడు?

శివరాత్రి వచ్చుచున్నయది. రాకుమారియు, నారాయణరెడ్డిస్వామియు నశ్వశకటముల నరుగుచున్నారు. పందెపు గుఱ్ఱముపై చిన్నపురెడ్డి వన్నెమీరు పాగాఁజుట్టి చిన్నమన్నె దొరవలె వచ్చుచున్నాడు. జనులందఱు, రెడ్డిస్వామిని, రాకుమారి చంద్రకుమారిని, గన్నారగాంచి యానందమంద నెద్దుగ చూచుచున్నారు. చిన్నపురెడ్డి ముందు చనుదెంచెను. జనులు క్రిక్కిరిసి యుండుటచే దారి గాన్పించుటలేదు. పెద్దలు గొప్పవాడుగదాయని యెదురువచ్చిరి. వారిని దారిదారియని కొరడా నురవడించుచున్నాడు. పౌరులకుఁ బౌరుషముగలుగుచున్నది. పరాభవింపబడితిమని భావించుచున్నారు. శాంతియుతులగు పెద్దలు "గుఱ్ఱమెక్కి యీపురివీధులఁ బోరాదనియు, హయమును దిగుమనియు ననుచున్నారు. చిన్నపురెడ్డి గ్రుడ్లురుముచున్నాడు. తొలుఁగుడని గద్దించుచున్నాడు. పౌరివారు దారినొసంగుటలేదు. గుఱ్ఱము నుఱాయించినాడు. అంబరవీధని హయంబెగిరి స్వారిదీసినది. జనుల ములుగఱ్ఱలు వానిపైఁ బడినవి. తలపాగా చిన్నపురెడ్డితలను రక్షించినది. ఒకటి రెండుదెబ్బలు గుఱ్ఱమునకు, రౌతునకుఁ దగిలినవి. గుఱ్ఱము పిట్టపోయినట్లు పోయినది. జనులు కొందఱు భూమిపై నొరిగిరి. కొందఱకుఁ గాళ్ళు విఱిగినవి. కలకలము బయలువెడలినది.

ఇక నీ సీమలో రెడ్డివారికిఁ గమ్మవారికి జెడినదను చున్నారు. కేకలు వేయకుడు. ఎవఁడో యొక దనళికాడు కన్నుగానక సంచరించినంత మాత్రమున దండ్రివలెఁగాపాడు నన వేమారెడ్డిగారిపైనినా యారోపము. వారికి యీవిషయ మెఱింగించిన వారూరకున్న ననంతరవిషయము విచారింత మనుచున్నారు. చూచు చూరకుందు రేల యనుచున్నారు. కొండనుండి ఎటు తప్పించుకొనిపోవు ననుచున్నారు. కర్రలు, కత్తి కర్ర, వీశెలఁగొని కొందరు కొండకుఁ బోవుచున్నారు. పెద్ద లాలోచించు చున్నారు.

రాకుమార్, నారాయణరెడ్డి స్వామి వారల శకట ములు వచ్చినవి. ఆ కలగుండువడు ప్రజాసమూహమును గాంచినారు. ఆగిరి. కారణము విచారించిరి. చంద్రకుమారి వారితోఁ బ్రసగించనున్నది. రెడ్డిస్వామి యాపెతో, వీరితో నేమి యనుచున్నారు. ప్రజలు ప్రభువులకు, వారి యుద్యోగు లకు లోబడవలయు గదా! జనుల కి యురువడి బనికిరాదను చున్నారు. వారికి లొంగిన బెట్టుసరి యిక నిలువదనుచు న్నారు. మిడుతలవంటి వీరికి గడుసు దనమేల ననుచున్నారు. హాయముపై నరిగిన గలుగు నవమాన మేమున్న దనుచు న్నారు. జనుల నణచియుంచుట రాజనీతి యనుచున్నారు. కదలుడుకదలు డనుచున్నారు. జనుల కాఠిని మాటలు వీను లకు ములుకులవలె సోకినవి. కండ్లెర్రఁ బడినవి. మీసలు మెలవేయుచున్నారు. బోడి గుండాయనకు నెంతటికండ కావర మనుచున్నారు.

రాకుమారి చంద్రకుమారీ బాయ్ వారలఁ గాంచినది.

శకటమునుండి దిగినది. వారిని శాంతిల్లుమని యనుచున్నది. ఆయనతో నేమి యనుచున్నది. రాకుమారెను. నామాట వినుమ నుచున్నది. సద్దుతగ్గినది. అందరును రచ్చబండ వద్దకుఁ జేరిరి. ఆమె దానిపై నిలుచుండినది. జనులు మూగియున్నారు. కమ్మవారిలో పెద్దవారు వినయ భయభక్తులతో నామెను. గౌరవ పూర్వకముగా నాదరించుచున్నారు. చిన్నపురెడ్డి చిన్నతనపుఁ జేష్టల చెప్పుచున్నారు. శిక్షింపవలయు నను చున్నారు. దెబ్బలు దిన్నవారలఁ జూపుచున్నారు. జీతము తగ్గించ మనుచున్నారు. కాని, వాని భార్యాబిడ్డల యుసురు తగులును. మఱొకచోటికి మార్పు చేయించమని కోరుకు న్నారు. రాకుమారి "తండ్రిగారితోఁ జెప్పి చేయింతు" ననుచు న్నది. జయ్ రాకుమారికి జయ్ అనుధ్వనులు మిన్నుముట్టినవి.

## 4. కోటప్పకొండ కలోలము.

ఉద్రేకులగు యువకుల శాంతి పరచుట దుర్లభము. కొంద ఱంగీకరించినను గొంద ఱంగీకరింపరు. అట్టిమొండి దిట్ట ములగు రెండు సంఘములకు సంఘటన గల్గినచో సద్దు కొనుట దుర్ఘటము.

సీ॥ కటికంటునకుఁ గాని కాయంబు కాయమే
పవన కుంభితచర్మ భస్త్రిగాక
భర్గుని పొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమ ధ్వనితోటి ఢక్కగాక
హరపూజనము లేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత దర్విగాక

కైలాసు జూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రంధ్రములుగాక
శంభు చింతలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబు గాక
అభవ భక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి పశువుగాక.

అని భక్తిపురస్సరముగాఁ బాడుచు గంతులువేయుచుఁ ప్రభథముంపరవారి యుల్లాసములకు దోహదమొనరించు లింగ బలిజల బద్యముల నాలించుట మానినారు. కోటయ్య యీ కొండమీద తపస్సు చేసుకొనుచుండ గొల్లభామ పాలిచ్చి వచ్చుచుండెడిదఁట ! యెంతటి పుణ్యాత్మురాలో యని చెప్పు ముసలమ్మల కథలు కట్టుఁబడినవి. కోటిజనము వచ్చిన గోటయ్య గొండ దిగివచ్చెద నన్నాడఁట. ఎక్కట కష్టముగా నున్నది. ఎప్పుడు కోటిమంది వత్తురోయని భక్తి పుర స్సరులై చెప్పుకొను జంగాల సంగతు లాగినవి. అందరును గమ్మవారినా? రెడ్లా ? ఏమిజేసిరి? అవమానమా? ఎక్కడ ? అను పలుకులే దిగంతరంబుల వ్యాపించినవి. దాన ధర్మంబు లొనరించిన ప్రాకుట కష్టముగాని, కొట్టు దిట్టయిన జుట్టుప్రక్కల నిముషములో ముట్టుకొనును. అందఱును జెట్టులై. జట్లు జట్లుగాఁ జరియించి చర్చించుచుండురు.

కోటప్పకొండవద్ద రెడ్డి, కమ్మవారల నవమానించె నన్నవిషయము ప్రాకినది. ఏసామాన్యునికో జరిగిన సరకు గొనరేమో? అందులో నాదెండ్లవారికి పూర్వమునుండియు రాజగౌరవము లందుచున్న కమ్మనాయకులకు మర్యాదనే

మన్నించు నాజండ్లవారికి, కమ్మవారందరికిఁ గోపముకలిగినది. అంతటితో బోనీయక చిన్నపురెడ్డి తాను నాజండ్లలో చేసివచ్చిన మెచ్చదగిన పనినిగురించి కమ్మవారి కగడుగలుగునట్లు బొగడుకొనుచున్నారు. ఇతర సేనలనుండి వచ్చిన రెడ్లు తమవాడు ఘనకార్య మొనరించినాడని మోదము వెలువరించుచున్నారు. దీనిని గాంచి కమ్మవా రుగ్రులగుచున్నారు.

మనవాఁడు మనవాఁడని మేములు రాచుకొనుటయే గాని, ఎక్కడి మనవాఁడో, ఊరేమో, పేరేమో, వాని సుగుణాలేవో, వాని కార్యము లేవో, నిజముగా మనవాఁడగునో, కాడో, మనస్సా విచారించువారు లేరు. అభిమానించుటయే, మాటికి బడాయిమాటలనుటయే జరుగుచుండినది.

కమ్మ, రెడ్డి విభేదము, ప్రథలయుత్సాహము భీభత్సముగా ప్రబలినవి. ఔరా! ఏమి యీ ద్వేషజ్వాల! కమ్మ, రెడ్డి యగ్నిహోత్రములు రెండు దూరుసుకొనుచున్నవి. అన్ని చోటుల నంతియే. ఇది కమ్మవారి ప్రభ. అది రెడ్డిగారిది. ఇది కమ్మవారి దుకాణము. ఇది రెడ్డిగారిది. ఇది కమ్మవారి చలివేంద్రమండి. ఇదిగో! ఇది రెడ్డిగారిది. ఇది కమ్మవారిసత్రమండి. ఇది రెడ్డిగారిది. మేము కమ్మవారి స్నేహితులము. ఇదిగో మేము రెడ్డిగారి హితులము. ఈతీరున నన్ని కార్యముల నన్ని సంఘముల విభేద మేర్పడినది. ప్రతిశాఖయు రెండుగాఁ జీలినది. దేశమునం దీరెండుసంఘములు ముఖ్యమైయున్న తదితర శాఖలకు వీరితో లావాదేవీలు మొదలగు

పను లనేకము లుండ నాశాఖల కెంటికిం గష్టలేర్పడ ననిష్ట మైనను, సమ్మతమాయినను, హృదయమున గాకున్నను, పైకి వ్యవహారమున కైన, తదితర శాఖలయందు కండు కష్టలేర్పడ వలసినదే. పెడ్డ, కమ్మ యను గట్టలకు, మధ్య దదితరజాతు లను జలము గల్గి, కాలువయనుపేర నడచు సంఘు మాకట్టలు వేఱయిన వరదవలె భిన్నభిన్నములై ప్రయోజన రహితమై చెడుట నిజము.

కోటప్పకొండ వద్ద బారులుదీర్చి యంగడుల నేర్పఱచి మధ్యం బెద్దవీథి నెలకొల్పినారు. దానిగుండ ప్రభ లూరేగ వలయును. నాల్గు త్రోవలు గలియుస్థలమున ప్రక్కప్రక్క లుగా, గమ్మవారిప్రభ, రెడ్డివారి ప్రభ వచ్చి నిలువఁబడినవి. వారి భజంత్రీలు, మాదుగలు, వీరి భజంత్రీలు, మాదుగలు సన్నాయిల నూదుచున్నారు, డప్పులఁ గొట్టుచున్నారు. వారి లింగబలిజలు, వీరిలింగబలిజలు సముద్రేకపూరితులై నారస ములు ప్రగుచ్చుకొనుచు—"శరభ, శరభ, దశ్శరభ, శరభ, నరశింహప్రకౌర్యంబు-నరశింహప్రకౌర్యంబు కన్నారతాగాంచి కన్నారవీక్షించి—ప్రళయాంత రుద్రుండు రౌద్రంబు తాం బూని - రౌద్రంబు తాదాల్చి - శరభ - శరభ - దశ్శరభ - శరభ - నరశింహు శిక్షింప - నరశింహు భక్షింప - శరి భావతారంబు - శరభావతారంబు - ధరియించి తానంత ధరియించిదానంత - నరశింహునిపైదూకి - నరశింహుపై దూకి - శరభ - శరభ - దశ్శరభ - దశ్శరభ చెండికండ లన్నింటి - కండలన్నింటి చెండి - మెండుగా బాధింప - బాధింపమెండుగా - లక్ష్మి తాయేడ్వంగ — యేడ్వంగతా

లక్ష్మి - నయంబూని శాదె - శరభ - శరభ - దక్ష్మరభ - శరభ - శరభో శరభ యని దశదిశలు పగుల నఱచు చున్నారు.

ఆ శృంగారమునకు నాకరు చేరిన రెండవవారికిఁ జోటులేదు. ఆ రెండు ప్రక్కలవారు, రెడ్డివారు, కమ్మవారు వారివారలతో నాదారులకూడలికి మున్ముందు చేరవలయు నని కోర్కె కలిగినది. నడునడు, పదపద, శరభ, శరభ, హరహర యను కేక లాకసమును జీల్చినవి. జనులు ముందు నకు త్రోసుకొనుచున్నారు. బుజము బుజము రాచుకొను చున్నవి. కమ్మ రెడ్డి తగాదాలు దలసూపుచున్నవి. చూచి నంతమాత్రమున నెగతాళిఁ జేసుకొనుచున్నారు. కారు కూతలు చెలరేగుచున్నవి. ఒకరిని నెట్టి యితరుల రెచ్చగొట్టి తన్నుకొన దయారగుచున్నారు. ఇదియే పౌరుషకార్యమని ప్రఖ్యాతియని పలుపోకలఁ బోవుచున్నారు. అజ్ఞానజనిత మష్టావేశమటఁ దాండవించుచున్నది. కార్యకారణముల విచారించువారు లేరు. దున్న యీనినదనినఁ బాలిచ్చును, నేయి నచ్చును, లాభము హెచ్చు, అను యోచనతో దూడను స్థానడిలో గట్టివేయుమనుటయేగాని విచక్షణాజ్ఞానము లేదే! అట్టివారు సాంఘిక నాయకులై, లోకనాయకులై, యుద్యోగులై చెలరేగుచుండిన నిక దేశ మట్టుడికిన ట్టుడకదా! చిట్టెడు పేలాలయినా నోరకునా! నీటియందే నిప్పుపుట్టదా!

అదియే నేడు కోటప్పకొండవద్ద జరుగుచున్నది. చిన్నచిన్న పట్టుదలలు, పోట్లాటలు పెద్దపెద్దవగుచున్నవి. అన్నిప్రాంతములఁ బొడసూపుచున్నవి. గడబిడ నడివీధిని

ముందు నడచుచున్నవి. జనులయందు రెండు కక్షలేర్పడినవి. మేము ముందు ; మేము ముందు. ముందే మేము వచ్చితిమి; మీకన్న మేమే ముందు వచ్చితిమి అనుచున్నారు. నెట్టుకొనుచున్నారు. నలుప్రక్కల జనులున్నారు. పోవఁ ద్రోవ లేదు. ప్రభల త్రాళ్ళు లాగువారా యొత్తిడిలోఁ బడుటలోఁ త్రాళ్ళను వదలుచున్నారు. వెనుకవారు ప్రభలు ముందునను పడునేమోయని బిఱ్ఱుగా లాగుచున్నారు. బండ్లను దోలువాండ్రు ముందుస్థల మాక్రమింప నెద్దులను తోలుచున్నారు. మెడల గంటలు గణగణ మ్రోగ నఱ్ఱులఱ్ఱులెత్తుక చుఱచుఱ ముందున్న నరులను బడద్రోయుచుఁ బరుగులెత్తుచున్నవి. హరహర ! యనుచున్నారు. ప్రభలు వెనుకకు నొఱిగినవి. రెండును నాగ్నేయాస్త్రములకుఁ దూలిపడుచున్నవి. వెనుకవారు పరువెత్తుచున్నారు. ముందువా రిది చూచి తగవు మఱది హరహర యనుచున్నారు. వెఱగు పడుచున్నారు.

జనసమ్మర్దము. త్రోసుకొనుచున్నారు. పరుగిడుచున్నారు. వానిక్రిందబడి నలిగెదమనియు, ప్రభలు భారమయినవనియు, నమందగతి నరుగుచున్నారు. ప్రభలు క్రిందఁబడుచున్నవి. చిన్నపురెడ్డి గుఱ్ఱము నడాయించబోవుచున్నాడు. వృషభములమధ్య నున్నాడు. అవి పొడిచినవి. గుఱ్ఱ మెగిరినవి. తన్నినది. అవి మఱల పొడిచినవి. తన్నినది. పొడిచినవి. గుఱ్ఱము పడిపోయినది. అంతకుఁ బూర్వమే కాబోలు చిన్నపురెడ్డి కొమ్ముపోయి, గుఱ్ఱపు తన్నుదిని క్రిందఁబడుటలో నెవరో యెత్తుకొనిపోయిరి.

ఒక యేనాది మానవతి దేవతాదర్శనమునకు వచ్చి నది. నిండు గర్భిణి. నీళ్ళాడనున్నట్లుది. జనుల యొత్తిడిచే క్రిందబడినది. ప్రసవించినది. ఔరా! ఏమి యీ యిక్కట్టు? ఆ పెకును శిశువునకును గతియేమి? శివుని యాజ్ఞ లేనిచోఁ జీమయినను గుట్టదను లోకోక్తి యేమయినది?

గీ॥ ధనము వీథిఁబడిన దైవవశంబున
నుండు; పోవు మూలనున్న నైన.
అడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు;
రక్షితుండు మందిరమునఁ జచ్చు.

అనుభక్తుల విశ్వాసముఁ బరిశీలింపబడు సమయము, దక్షయజ్ఞధ్వంసియగు, వీరరసావతారమగు వీరభద్రుని రూపమున నీ ప్రభ నిర్మింపబడినది. వీరభద్రుని యాకారమిదియే. రౌద్రరూపమే. ఆ యుగ్రరూపమును నిర్మించి శరభశరభ యను నరసింహయుగ్రముకన్న మిన్నయగు మహోగ్రశరభమూర్తిని ధ్యానించునప్పుడు, వీరంగములు పూరించుచున్నపుడు, గోముఖాదిధ్వనులు మ్రోయించునప్పుడు, ప్రతివానికిని బౌరుష ముదయించి యుత్సాహము గలుగునే! అట్టియెడ వీరలు శాంతివీడి, భక్తివీడి విచ్చలవిడిగా దురభిలాషాప్రేరితులై యీతీరుగ ఘోరకార్యములఁ బోరాటములకుఁ బూనుకొనిన వీరల కావదలురావా? వినాశనమందరా? సహజవీరస్వరూపమగు వీరభద్రున కావేశము, రౌద్రము గలుగదా! అందుచే నీ ప్రభలు పడుచున్నవి. ఆ సంకుల ధ్వనుల నాలించు నీవు, యీ త్రొక్కుడులలోఁ జిక్కు నీపెయు, నా కనుగ్రందు బ్రతుకుట దుర్లభము. మైలపోకినది

యని యొకప్రక్క గణాచారిగణము లొక్కింత ప్రక్కగా నొత్తిడి తగులని ప్రదేశముల నాడుచున్నారు.

నైఋతిభాగమున నశ్వశకటమొండు గలదు. అందొక స్త్రీయు సన్యాసియు నున్నారు. వారి ప్రభలుపడుటం జూచిరి. ముందునకు వచ్చిరి. ప్రభలు రెండుశిరములనున్నవి. ఇంకపడును. ఆపె యీయేనాదిదానిని, శిశువును బొడగాంచినది. దయారసము జూడ్కులనుండి వెలికి స్రవించినది. వంగినది. పిల్లనుబట్టినది. తల్లి నొడిసినది. బండిక్రిందికి లాగినది. ప్రభలు బండిమీద పడినవి. బండి కినుపసామానులున్నవి కాన. మొప్పమురాలేదు. గుఱ్ఱములు చతికిలబడినవి. ఆబండివారు కొందఱు నలిగిరి. రాకుమారి చచ్చెచచ్చె ననుచున్నారు. త్వరితగతి వానినిం దొలంగించిరి. జనులు నలుప్రక్కలం గ్రమ్మియున్నారు. రాకుమారి చంద్రకుమారి బండి నొగలెక్కినది. ఏనాదిమానిని, శిశువుల క్షేమముదెలిపినది. వారినడకల దూరినది. నాజండ్లలోని పొరపాటును సరిపుచ్చిన సరణి నెఱుకపఱచినది. అజ్ఞాన సంచరణము నధిక్షేపించినది. రెండుసంఘములవారికి జ్ఞానోపదేశము చేసినది. వారు తప్పు గ్రహించిరి. జరిగినవి మఱచిరి. సంతోషస్వాంతముల రాకుమారి చంద్రకుమారికి జయ్ యను జయధ్వానములొనరించుచున్నారు.

## 5. శారద, మైత్రి.

మహాతల్లీ! మాది యీకొండవీటికిఁ దూర్పుగానున్న చేబ్రోలునకు నాగ్నేయముగానున్న గొల్లలకోడు. ఆ గ్రామాధికారియింటఁ జాకిరిఁజేసుకొని జీవించువారము. శ్రీవారిజనకులు దాసిని "బ్రాహ్మణకోడూరు" అనిమార్చి మాధవపెద్ది నాగేశ్వరశాస్త్రిగారికి నగ్రహారముగా నొసంగుటచే గాపు కరణము లిరువురు మఱియొక పురమున కరుగ వలసి వచ్చినది. మాయధికారి కింతేసునను జేరెను. ఆయన స్థితియుఁ దారుమారయ్యెను. చిఱుతకాలమునుండియు గొప్ప వారివద్దఁ బన్నచిన్నపనులొనర్చుచు తేలిగాఁ గాలముగడిపి నారమగుటచేఁ గష్టకార్యము లొనరింపనేరని వారమైతిమి. అటనుండి నల్గురుపిల్లలను జేబట్టుకొని నేను, భర్తయు గుంటూరు (ప్రాంతపుగుంటూరు) సమీప రామచంద్రపురాగ్రహారమునకుఁ జేరుకొంటిమి. పాప మాయనయిల్లు చల్లగా నుండ, ఆ రాయప్రోలు లక్ష్మణసోమయాజులుగారు మహానీయుఁడు, కరుణామయుఁడు, వారిసత్రమున నాలుగు సంవత్సరములుంటిమి. ఎంతయో సాయము సేయువాఁడు. బ్రాహ్మణ ప్రభువు. ప్రతిసాయంతనమున స్కాందపురాణ మాకర్ణించు భాగ్యము గల్గినది. ప్రతి యుదయము భాగవత పురాణముఁ జదువును.

"ఏ భాగవతముఁ జదువును?"

"భాగవతమన దేవీభాగవతమే. మన భారతీయ సాంప్రదాయమున నార్ష పౌరాణిక మతమున బ్రహ్మ, విష్ణు శివ దేవీమూర్తులర్చింపబడు నారాధనా దేవతలు. వారి

విషయమైన పురాణములునిర్మింపబడినవి. శ్రీభాగవతము.పదు నెనిమిది పురాణములఁజేర్చిన దేవికినిరూపింపబడిన పురాణము లేదు. కాన పురాణముల గణనయందుగల భాగవతము దేవీ భాగవత మేగాని శ్రీభాగవతముగాదు. ఈభాగవతము వ్యాస భాగవతముగాదనియు, బోపదేవుఁడెనిమిదవ శతాబ్దమున వ్రాసెననియు, బోపదేవుఁడు బౌద్ధుఁడై పీనిని వ్రాయుచు నిందు విపరీతమగు విషయములు వ్రాసెననియు, చరిత్రనిర్ణేత సంఘమువారు నిర్ణయించినారు. కాన చరిత్రజ్ఞాన విహీను లును, మూఢభక్తి గలవారును, శ్రీమద్భాగవతకథయందుఁ బ్రేమగలవారైరి దానియభిమానమున నదియే పదు నెనిమిది పురాణములలో నొక్కటని తలంతురు.

అన్నను. బౌద్ధ, జైనాదిమత నిర్ణయములు భాగవత మునఁ గలవు. కావున శ్రీమద్భాగవత మిటీవలి కల్పిత గ్రంథము. హరివంశ, విష్ణుపురాణముల క్రోడీకరింపు. ప్రత్యే కముగా విష్ణుమతప్రబోధకి. తదితర మతస్థుల మతగ్రంథముల నడఁచివైచుటకుగాని; లేదా కృష్ణుని చర్యలు నాలకించి విముఖమందుటకుగాని వ్రాసియుండిన మతేతరుని చర్యగాని యై యుండును.

కాని దౌర్భాగ్యులమగు మా కా యునికి నిలచినది కాదు. బిళ్ళవేటుగాఁ బిల్లలంద ఱొక వత్సరములో గతించిరి. చక్కదనాల చుక్కలు. వారిని జూచిన నాకలికి మాఁడు చున్న పొట్టయినను సంతోషరసంబున నిండియుండునది. అభా గ్యులకు దక్కునా ? కోయువాఁడు మంచి పఢ్డనే కోయును గదా! భగవానునికి మాపై నంతటి కోపము వచ్చినది.”

"అయ్యో! అమ్మా! కరుణారసమయుఁడగు భగవాను సట్లనరాదు. ఎవరికర్మ వారిది. ఇట్లు దూషించిన నింకొక కర్మయగును. పాపాత్ముల మగుదుము."

"దేవి! పట్టరాని దుఃఖము నెంతడచుకొనినను నాగదు. పొరబాటుచే స్త్రీసహజభీరుస్వభావముచే నిట్లంటిని. తాము మహోన్నత వంశమందు జన్మించినవారును, ధీరోదాత్తులును, గంభీరస్వభావులును, దానకర్ణులునగు మహారాజాధిరాజ ఛత్రపతి యన వేమారెడ్డి మహాప్రభువుల పుత్రికలును, యోగిరాజు వేమనగారి యన్నకుమార్తెలును, శిష్యురాలు నవుటచేత తల్లీ! అట్టి సద్గుణవిశేషము లలవడియెగాని తక్కొరులకు దక్కునా! దుర్లభము, దుర్లభము."

రాకుమారి॥ "శారదా! ఈ వర్ణనలతో నేమిగాని కరుణారసపూరితమగు నీ చరిత్రమును వర్ణించుము. ఇట్టి చరిత్రము లాకర్ణింప నాకు మనసగుచుండును."

శారద॥ అనాథరక్షకురాలవు. ఆపదోద్ధారకురాలవు. కరుణామయమూర్తివి. మీ చరిత్రము, పురుషసింహులకే యొనర్ప నవకాశములేని యా మహాత్కృష్టకార్యమును ప్రభలమధ్యఁ బ్రాణములు పోవుచున్న యానాదినారీమణిని రక్షింపఁజాలిన మహావీరకార్యము నింకొకరికి గలదా! చూచువారందఱు నిశ్చేష్టులైయుండ మెఱుపుమెఱసిన ట్లురువడిఁ జని రక్షించిన కాళీమూర్తివి-మహాదేవీ! ఆవీరమూర్తి నేటికిని గండ్లయందు మెలంగుచున్నది.ఆమూర్తి యీమూర్తి గాదు. ఇది శ్రీరాముని జేపట్టనుండిన నా జానకీసుందర మూర్తి, లక్ష్మీమూర్తి. అదియో యాపదోద్ధారిణియగు

జనుల రక్షింప సమకట్టి బయలు వెడలు నపరపార్వతీరూపము.
సకలవిద్యాపారంగతురాలవగు మిమ్ము భారతిగా నేలభావింప
రాదు ? మూడుమూర్తుల నేకమగు బాలారూపధారిణివి.
కుమారివి. రాకుమారివి. చిత్తరువులయందు గాళీమూర్తిని
గాంచుచుందుముగాని, సక్రమముగ లేదు. ఆరచనాధురీణుడు
మీ యాకారము, నానాటి యాకారము నొక్కసారి గాంచి
నేని తన చిత్తరువు లింక జక్కగా సవరించుకొను ననుటకు
యతిశయోక్తిగాదు.

రా॥ కు॥ వందిమాగధుల వంశజులగు వనితలకును,
ముఖస్తుతి యొనరించుట సహజముగదా. నీచరిత్రములోనికి
రమ్ము.

శారద॥ ఆ వంశధర్మ మదియేగదా ! అయినను నా
పసిమింటికి మొదటినుండియు విద్యాగంధమబ్బిన తదుపరి
యాచించుట, వర్ణించుట నారకి హేతువని—

సీ॥ పురవైరి నర్చించు కరములు కరములు
శ్రీకంఠు వర్ణించు జిహ్వ జిహ్వ
శూలహాసుని జూచు చూట్కులు చూట్కులు
శేషభూషణు మ్రొక్కు శిరము శిరము
వృషభేషు నాలించు వీనులు వీనులు
మధునాథు దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
ముక్కంటిమీదిదా బుద్ధిబుద్ధి
దేవదేవుని జింతించు దినము దినము
సాంబమూర్తిని బ్రకటించు చదువు చదువు

గో త్రజాధవు( జెప్పెడి గురుడు గురుడు
తండ్రి ! హరు( జేరుమనియెడు తండ్రి తండ్రి.

అని తలంచి శక్తికొలది నేదియో చాకిరి చేసుకొని బ్రతుకుద మని సౌఖ్యముగా( గాలక్షేపము సేయువారము.

రా॥ కు॥ ఆహా ! ఏమి యీ పద్య మెంత రసవంతముగా నున్నది. భక్తియుక్తముగా నున్నది. ఎవరు వ్రాసినది? నీ భర్త కవిత్వము చెప్పగలడా?

శా॥ కవిత్వము( జెప్ప(గలరు. వారు బాల్యములో నల్లరిగా( దిరిగెవార(ట. వారి తండ్రిగారు విద్యాహీను(డని గృహంబుననుండి వెడల నడువ( గాకతీయ సామ్రాజ్య రాజధానీనగరమై, యేకశిలా నగరమను విఖ్యాతిని విరాజిల్లు నోరుగంటికి( జేరి యటనున్న దూర నాశ్రయించియుండు మాతులుని జేరి, వారు మహాభక్తుండగు, నద్వైతవేదాంత విద్యాదురంధరుడగు, నాత్మారామ భక్తాగ్రేసరుండగు సర్వమతసమ్మతమార్గాన్వేషి యగు మహనీయుని, నూరికి నుత్తరముగా, బర్ణశాల యందు భార్యాపుత్రులతో, ఛాత్రపుంగవులతో నివసించు కవీంద్రుడు బమ్మెర పోతనామాత్యు(డు తన శిష్యాదుల గూడుక శ్రీమద్భాగవతమునకు( దెను(గు సేతసేయువాడు. కొన్ని భాగంబుల వ్రాయించువా(డు. బమ్మెరవంశపారావారసుధాకరు(డు పోతరాజు కవీంద్రుని యాశ్రయించి శిష్యరూపమున వరిల్లి, కొల(దిగనో గొప్పగనో విద్యాయుక్తుడై తద్భాగవత రచనయందు వ్రాతపని నందుకొని సహాయ మొనరించుచు(గాలము గడిపిరి. తమవరి—

రా॥ కు॥ మా యాస్థాన కవీంద్రులగు శ్రీనాథమహా

కవిగారి బావగారఁట వారు. ఏరాజుల నాశ్రయింపక వ్యవసాయ వృత్తిని జీవించుచుఁ గవిత్వ రచనాదక్షుఁడై చరించువాఁడఁట. కతిపయదినంబుల ప్రయాణంబున నేకశిలానగరము గంగానదికిఁ గలఁదట. గంగ యుత్తరదేశమునఁగదా కలదు? అచ్చట నేకశిలానగరము కలదా ? రాజమహేంద్రవరమునకేగెను శ్రీనాథకవిరాజుగారు. వారు వచ్చిన సందియము దీరఁగలదు.

శారద॥ ఆవిషయము నే నెఱుంగుదును. రాణులకు వీనులవిందగు కార్యకలాపముల నాలాపములుగాక మాకుఁ గావలసిన వేఱుకార్యము లేమున్నవి? నామసామ్యమును బట్టి యనేకులు మాప్రదేశమే యది యిది యని వాదులాడుచుండెదరు. మనయాంధ్రదేశీయులు పర్ణశాల భద్రగిరినద్దనున్నదనియు, నిట శ్రీరామచంద్రమూర్తి నివసించెననియు, వచించెదరు. శూర్పనఖ నాశికాచ్ఛేదనమగు స్థలమగుట నాప్రదేశమునకు నాశిక యనుపేరు వచ్చినదనియు వచించెదరు. పురాణాంగముల జాగ్రత్తగాఁ బరిశీలించినచో నాంధ్ర పర్ణశాలయే సరియైనది. ఆతీరున నేయే మారుమూలనోనున్న నీకొండవీడును రుక్మిణీదేవి జన్మస్థానమగు కుండినపురమని చెప్పుకొనుట లేదా? సీతాదేవి ముట్టయిన ప్రదేశమున గట్టిన నీయూరునకు ముట్నూరు అని నామము వచ్చినదనియు వాకొనుట లేదా?

ఆతీరుగనే యేకశిలానగర మనఁగాఁ బ్రఖ్యాతికై పాటుపడువారు ఒంటిరాయి, ఒంటిమిట్ట, ఒక్కరాయి, ఏకశిల యను గ్రామముల పేరులున్నంత మాత్రమున దమగ్రామమే

యాచరిత్రవిఖ్యాత నగరరాజమని మురిసిన, గ్రంథములు వ్రాసిన స్థలపురాణములు నిర్మించిన సమంజసమా? అజ్ఞానులు నమ్మిన నమ్ముదురుగాక. రవంత విచక్షణాజ్ఞానముకల వారెవ్వరు విశ్వసింతురా! ఏకశిలానగర మూ ఓరుగల్లుగాని మఱి యొండు గాదు. పోతన మహాశయుఁడు భాగవతము వ్రాయబూని యందు తాఁజేసిన విషయ మిట్లు వ్రాసుకొని యున్నాడు. ఒక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకంగని సజ్జనానుమతంబున నభ్రంకషశుభ్రసముత్తుంగ భంగయగు, గంగకు జని గ్రుంకులిడి వెడలి మహనీయ మంజులపులినతటమంటప మధ్యంబున మహేశ్వర ధ్యానంబుఁ జేసి అటుతరువాతఁ గనులు మూయుటయు, రామభద్రుఁడు గాన్పించుటయు మొదలగు విషయముల నేడు పద్యములు వ్రాసి యనంతవచనంబున కృతార్థత్వంబు సిద్ధించెనని బుద్ధి నెఱింగి లేచి మరలి కొన్నిదినంబులకు నేకశిలానగరంబునకు జనుదెంచి గురువృద్ధబుధబంధుజనానుజ్ఞాతుండనై అని తన వంశావతారమును వర్ణించుకొనుచు గ్రంథభాగములోనికిఁ జొచ్చెను.

దీనిని విమర్శించి చూతుము. గంగయనిన కాశీగంగకును, గోదావరికిని, గావేరికిని బేర్లు. అందు ఏకశిలానగరము తెలుగు దేశములోనిది. ఆంధ్రదేశమున భద్రగిరికిని, దేవగిరికిని మధ్యనున్న గోదావరిని నాప్రాంతమువారు 'గంగ' యని వాడెదరు. దానికి గొన్నిదినముల ప్రయాణంబుననున్న దీయేకశిలానగరము. చరిత్రాత్మకమైన "ఓరుగల్లునకే" నేకశిలానగరమని పండితులు, కవులు, శిల్పులు వాడుచున్నారు.

అనామిక గ్రామంబుల కావాడుకరాదు. అదియునుగాక కృష్ణ, నర్మదవంటి నదులకే గంగయని పేరులేనప్పుడు, పేరు ప్రతిష్ఠ లేని గుండ్లకమ్మ, పాలేరు, పెన్నలను గంగయనియు, దాని సామీప్యముననున్న "ఒక్కరాయి, ఒంటిబండ, ఏకరాయి, ఒంటిమిట్ట, ఏకమిట్ట"యను కుగ్రామముల కా యేకశిలానగర మునే జెప్పుకొనుచు, వానిని నిరూపించుటకై కల్పితశాసనములఁ గల్పితగ్రంథముల వ్రాయు దురభిమానప్రేరితుల వచనంబులకు వంచింపంబడరాదు.

నన్నయభట్టు నామమున భట్టుశబ్దమును గాంచి మా భట్రాజే, మావంశస్థుఁడేయని చెప్పుకొనుచుఁ గాలముఁగడపినచో, మేము మాయనుయాయులు మురిసినను నన్నయభట్టు భట్రాజుగాఁడు. అలాగుననే ప్రఖ్యాతిగాంచిన పోతన మా వంశస్థుఁడనీ, ఏకశిలానగరము మాయూరేననీ, గంగ మా పెద్దవాగేనని, వాకొనిన లాభమగునా? ఇతరకులస్థులైనను భాగ్యవంతు లయినచో, మనవాఁడే, మావాఁడే యనుచుఁ దరిఁజేర్చుకొను వ్యవహార మెల్లరుఁ గనుదురుగదా! అలాగుననే కొందఱు వారి ననుసరించి తలద్రిప్పెదరు.

ఏకశిలానగర పరిసరమున బమ్మెరయను పురంబు వరలుటయు, బమ్మెరవారా వాడయందుండుటయు, భాగవత గ్రంథములా ప్రాంతములయందనేకము లుండుటయు, నను విషయములను విచారించిన జరిత్రాత్మక "ఓరుగల్లే" యేకశిలానగరమని మూరుపేరున బ్రఖ్యాతిఁగాంచు ఓరుగల్లే బమ్మెర పోతరాజుగారి నివాసగ్రామమని తెలియుట లేదా? కొందఱు పొఱపాటున నబద్ధమాడి దానిని నిలుపుకొనుటకై

యసత్యములగూర్చి వాదించుచుందురు. వారివాదనలతో నేమి?

ఆ పోతరాజు మహాకవీంద్రుని, ఆ సత్కవీంద్రుని, ఆ యద్వైత మతావలంబుని, ఆ యాత్మారామ భక్తాగ్రేసరుని, ఆ మహేశ్వర పూజాధురంధరుని, దాక్షిణ్యప్రసాదమున మా వారు విద్యావంతులై, కవులై వరలిరి. అందందు సంచరించుచువచ్చి కొలూరును నివసించి మర్యాదగాఁ గాలంబుఁ బుచ్చు మాతండ్రిగారింట నిలచి వారితోఁ బ్రసంగించుచుండిరి. నేను మాతండ్రివద్దనే యుంటిని. అప్పటికి నాకి మూడేండ్లయినది. నన్ను విద్యావతిగా నెఱింగ మాతండ్రిని మెప్పించి నన్నుద్వాహమాడెను. కొన్నిదినంబులు పుట్టినింటనే యుంటిమి. ఎన్నిదినంబులు స్వాతంత్ర్యజీవనము లేక యుండుట? అని తలంచుచుండ, గొల్లలకొండయొడయుని మైత్రి దొరకినది. వారిమైత్రిచే మల్లవిద్యయందసమానశక్తి సంపాదించినారు. శస్త్రాస్త్రములయందును మేటియే. నాకు సూరపరాజు, సూరపరాజని కలవరించునట్లు విశ్వాసపాత్రులై వెలసెడివారు.

దేశదేశములు తిరిగితిమి. వేదాంత విద్యాగోష్ఠినున్న వారి సేవను, గోష్ఠినినుండి, కాలముఁబుచ్చు నుద్దేశ్యముగలిగెను. తమ్ము దర్శించితిమి. తమచిత్తము, మాభాగ్యము. మీకరుణారసమూర్తి సేవకున్న నుత్తమకార్య మింకొకటి గలదా?"

రాకుమారి॥ శారదా! నీవిశారదత్వమునకు మెచ్చితిమి. నీవిద్యాకౌశలము మాకు నిరంతరానందదాయకమగును. నీభర్త నీవలె మాకు విద్యావినోదమొసంగుగాక. మన శిబిర

సంరక్షకులకతఁ డొడయుఁడునై యుండుగాక. శాంతముగ కాలముగడపుటకన్న మనకుఁ గావలసిన దేమి?



## 6. వేమన మఠము—విద్యోపన్యాసము.

జయ్ గురునాథా! జై గురునాథా! కొండపీటి జంగమా! వేమనయోగీంద్రా! కొండవీటి మఠాధిపా! అని భక్తులు జయజయధ్వానులు చేయుచున్నారు. కొందఱు నమస్కరించుచున్నారు. కొందఱు నిమీలిత లోచనులై యేకాగ్రచిత్తులవలె నున్నారు. అనేకులు కూర్చుండి యున్నారు. వారిమధ్య రాకుమారి యిట్లనుచున్నది. గురుఁడే బ్రహ్మ. గురుఁడే విష్ణువు. గురుఁడే దేవుఁడు. గురుఁడే మహేశ్వరుఁడు గురుఁడే సాక్షాత్తుగాఁ బరబ్రహ్మము. మన జన్మములు ధన్యములయ్యెను. అట్టి మహనీయుల యాశీర్వచనములందఁ జాలిన మన జీవితములు పావనములయ్యెను. గురువు అనగా నంధకారమును బోగొట్టువాఁడు. అజ్ఞానాంధకారమును బోగొట్టువాఁడు.

వీక్షింపఁగా వసుధయం దనేక వృక్షములు, గడ్డి, ముండ్లమొక్కలు, విచ్చలవిడిగా మొలచుచున్నవి. కర్షకుఁడా పొలమును దున్ని యా మొక్కలను దీసివైచి సవ్యమగు రీతిని బైరుఁ బెట్టుచున్నాఁడు. అప్పుఁ డది యుపయోగవంత మగుచున్న యది. ఆక్షేత్ర మెందుకుఁ దగినదో తదనుకూల

ము పంటలం బండించుచున్నాడు. ఒక్కొక్కప్పుడా క్షేత్రమే మహారాజోద్యానవనమో, యే మహాత్ముని యాశ్రమస్థలమో యగుట సంభవించుచున్నది.

బాలికా, బాలురను బాలించు మాతా పితలనుఁ జూచుచు తమ చిరుతలు చిన్నప్పటినుండియు దుర్వ్యాసంగమునం గొండకుండునట్లు పలయు నీతి బోధనలు మనముల నాటఁ జెప్పి దిద్దుకొనుచున్నారు. ముఖ్యముగా నైదవయేటి వఱకుఁ బిల్లలు తల్లిదండ్రనే పెరుగుచున్నారు. ఆపెయే సర్వ విధముల బిడ్డవానిని జల్లఁగఁజూచు మూర్తి యగుచున్నది. ఆపెయే యాకసుగందుని, సుకోమలహృదయ క్షేత్రమందుఁ జతుర్విధ పురుషార్థముల సంపాదించుకొను నేర్పును, శమదమాది సద్గుణసంపద లలవరచుకొను చాకచక్యము, సాధుత్వమును గలుగఁ జేసుకొను తెలివితేటలు నాపాదింపవలసియున్నది. కాన దీనిబట్టి కాంచినచో నువిద విద్యావతి యగుట యవసరము. తల్లి భీరువయియున దన బిడ్డలకుఁ బిఱికితనముఁ బోయుచున్నది. మాటిమాటికి వాని నొంటిగఁ బంపుటకు భయమందుచున్నది. దిగులు పడుచున్నది. ఆపె వీరాంగన వీరవతియైనచో వీరమాతకగుట కాటంక మేమున్నది ?

కాయకష్టముఁ జేయు నలగా జాతులయందుఁ బిల్లల జూడుఁడు. నిర్భయులై కష్టకార్యములు సేయుటయందుఁ జాకచక్యము గలవారై యుందురు. వారికి విద్యాగంధ మున్నయెడల వారివారి కార్యముల నవలీలగాఁ గొలది కాలములో నేర్పుగా నొనర్ప నసేక యవకాశములు గలవారగుచుందురు. అట్టి విద్యాభ్యాసము వారికిఁ గలుగకుండ నుండు

టకుఁ గల కారణమెయ్యది ?

వారేమందురు ? మాకుఁ జదువెందుకు ? కష్టపడి చాకిరి సేయువారము. కాగితము నలుపుఁజేసి యూళ్ళేలడమా ? అని విద్యను నిసడించుటచేతనే, విద్యావిహీనులగుటచేతనే యందరికన్న వెనుకఁబడి యలగాపులమను పేరునకుఁ దగ తమతమ యల్పవిశ్వాసము లేని జనుల విశ్వసించి నిమ్నజాతుల వారగుచున్నారు.

ఎన్నఁడీ నిమ్నజాతుల వారికి విద్యాగంధమబ్బునో, వెంటనేవారు తదితర కులముల వారలఁ గమనించి, ఈశ్వరుని దృష్టికి నందరము సమానులము. అందరము సోదరులము. తల్లికి తనయులందఱొక్కటిగాదా ! అట్లగిది నాపరమపిత కందర మొక్కచందము వారమే. ఒకరిని గోసిన నెత్తురు, మరియొకరిని గోసిన బాలుగారునా ? గోవులు, గుఱ్ఱములు, గాడిదలకుండినట్లు, మానవులయందు భేదములున్నవా ? ఈ జాతిభేదములు గల్పితములు. విద్యావంతులందఱొక విధమున, చోరులందఱొక తీరునఁ వరకులందఱొక చక్కని, కూలినాలి వారందఱొక చాలున, నెలివారందఱొక నెలవున నుండుటచేతనే, మూలసూత్రములు గమనింపకఁ బోవుటచేతనే, యొకరినొకరు కలసి మెలసి సంచరింపకుండుట చేతనే, వ్యతిరేకములు, విభేదములు, విద్వేషములు, విపరీతములు నెలయుచున్నవి. విద్యావంతులకీ విభేదములుండవు. జాతి, మత, కులగోత్ర విచక్షణలేక వారు సర్వసమ్మతులై సంచరింతురు. ఆసర్వ సమదృష్టి లేనివో సర్వసౌభ్రాతృత్వము రాదు. అది లేనివాడు శివభక్తుఁడు సంహ్లాదుడు

వర్ణించినట్లు—

సీ॥ సంసార జీమూత సంఘంబు విచ్చునే
శంభుదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్ను లడఁగునే
ఈశసేవామృత వృష్టి లేక
సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే
హరమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారం బడంగునే
పశుపతినుతి రవిప్రభలు లేక
నిరుపమా పునరావృత్తి నిష్కళంక
ముక్తి నిధిగాన వచ్చునే ముఖ్యమైన
సాంబశివమూర్తి చింతనాంజనము లేక
తామరస నేత్రునకు నైన దాపసేంద్ర.

ఇట్లు సంచరించనిచో వానికి మోక్షము లేదు. భగవంతుని సాక్షాత్కారమే మోక్షోపాయము.

నిరాకారనిరంజన స్వరూపుఁడగు భగవంతుని కాకారము లేదు. ఏయాకారమైనను ప్రపంచములోనిది. నీభావ ప్రతిబింబములగు మూర్తులీ నిరాకారమునకుం బోలవు. సకల విశ్వమూవిశ్వమూర్తి యొక్క మూర్తియగుటచేతనే నీ విశ్వ మానవసేవఁజేసిననే నిజమగు భక్తులమయ్యెదము. సద్గుణములు కుదురును. అదియే మోక్షమార్గము. ఇది బోధించు వాఁడే గురుఁడు. ఇతఁడు లోకమార్గమును బోధించు గురువు. అట్టి గురువునేకదా భక్తిగలిగి సేవించి సాఫల్య మంద వలసినది?

టకుఁ గల కారణమెయ్యది ?

వారేమందురు ? మాకుఁ జదువెందుకు ? కష్టపడి చాకిరి సేయువారము. కాగితము నలుపుఁజేసి యూళ్ళేలడమా ? అని విద్యను నిరసించుటచేతనే, విద్యావిహీనులగుటచేతనే యందరికన్న వెనుకఁబడి యలగాకులమను పేరు నకుఁ దగి తమతమ యల్పవిశ్వాసము లేని జనుల విశ్వసించి నిమ్నజాతుల వారగుచున్నారు.

ఎన్నఁడీ నిమ్నజాతుల వారికి విద్యాగంధమబ్బునో, వెంటనేవారు తదితర కులముల వారలఁ గమనించి, ఈశ్వరుని దృష్టికి నందరము సమానులము. అందరము సోదరులము. తల్లికి తనయులందఱొక్కటిగాదా! అపగిది నాపరమపిత కందర మొక్కచందము వారమే. ఒకరిని గోసిన నెత్తురు, మరియొకరిని గోసిన పాలుగారునా ? గోవులు, గుఱ్ఱములు, గాదలకుండినట్లు, మానవులయందు భేదములున్నవా ? ఈ జాతిభేదములు గల్పితములు. విద్యావంతు లందఱొక విధమున, శూరులందఱొక తీరున, వరకు లందఱొక చక్కని, కూలినాలి వారందఱొక చాలున, నెలివా రందఱొక నెలవున నుండుటచేతనే, మూలసూత్రములు గమనింపకఁ బోవుటచేతనే, యొకరినొకరు కలసి మెలసి సంచరింపకుండుట చేతనే, వ్యతిరేకములు, విభేదములు, విద్వేషములు, విపరీతములు నెలయుచున్నవి. విద్యావంతులకీ విభేదములుండవు. జాతి, మత, కులగోత్ర విచక్షణలేక వారు సర్వసమునై సంచరింతురు. ఆసర్వ సమదృష్టి లేనిచో సర్వసౌభ్రాతృత్వము రాదు. అది లేనివాడు శివభక్తుఁడు సంహ్లాదుడు

వర్ణించినట్లు——

సీ॥ సంసార జీమూత సంఘంబు విచ్చునే
శంభుదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్ను లడఁగునే
ఈశసేవామృత వృష్టి లేక
సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే
హరమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారం బడంగునే
పశుపతినుతి రవిప్రభలు లేక
నిరుపమా పునరావృత్తి నిష్కళంక
ముక్తి నిధిగాన వచ్చునే ముఖ్యమైన
సాంబశివమూర్తి చింతనాంజనము లేక
తామరస నేత్రునకు నైన దాపసేంద్ర.

ఇట్లు సంచరించనిచో వానికి మోక్షము లేదు. భగవంతుని సాక్షాత్కారమే మోక్షోపాయము.

నిరాకారనిరంజన స్వరూపుఁడగు భగవంతుని కాకారములేదు. ఏయాకారమైనను ప్రపంచములోనిది. నీభావ ప్రతిబింబములగు మూర్తులీ నిరాకారమునకుం బోలవు. సకల విశ్వమూవిశ్వమూర్తి యొక్క మూర్తియగుటచేతనే నీ విశ్వ మానవసేవఁ జేసిననే నిజమగు భక్తులమయ్యెదము. సద్గుణములు కుదురును. అదియే మోక్షమార్గము. ఇది బోధించు వాఁడే గురుఁడు. ఇతఁడు లోకమార్గమును బోధించు గురువు. అట్టి గురువునేకదా భక్తిగలిగి సేవించి సాఫల్య మంద వలసినది?

లౌకిక విషయములందును జూడుఁడు. ఎన్ని విషయముల నెఱుంగ వలసియున్నదో? ఒకఁడు జనోపయోగమగు వైద్యశాస్త్ర మెఱుంగును. వాఁడెన్ని యోషధుల రసవిష గంధకాదుల నెఱుంగవలసి యుండునో యరయుఁడు. వానిని సేవించి దయ సంపాదించినగదా నారహస్యంబుల నెఱుంగఁ జాలునది. ఆ వైద్యుని చెప్పుచేతలయం దొప్పులకుప్పయై సంచరింపవలదా! ఆశ్రయించువా రాలకించువారు, శ్రద్ధాళువులై యున్న కొలఁదిఁ దెలియపఱచువారి యుల్లము లుల్లాసవంతములై, కొల్లలు కొల్లలుగాఁ దెలియులాగున దేటతెనుఁగు మాటలతోఁ దేనెలసోనలట్లు బోధింపఁగలరు. మన కది యనుభవము.కాన మీరెల్లరు గురువులఁ బరమభక్తిని సేవించి పరమానంద సుధారసనిమగ్నత నొందుఁడు.

అని యుపన్యసించి కూర్చుండినది. జయ్ రాకుమారికి! జయ్ చంద్రకుమారిబాయికి! జయ్ వేమనయోగీంద్ర శిష్యురాలికి యని యనుచున్నారు. ఇంతలో శారద లేచినది. యిట్లనుచున్నది.

ఇట నున్న యీ మహనీయుని గాంచుడు. అనేక గురువులఁ జేరి, కాయకష్టముల కోర్చి, యనేక వత్సరములు ఘోరతపస్సు గావించి, సిద్ధినంది, మన వేమనయోగివలె సర్వసంగపరిత్యాగియగు నీ నారాయణరెడ్డిస్వాములవారిని గాంచుడు. వీరి రాకవలన మనమందరము ధన్యులము. వీరీ మఠముననే నిలుతురఁట. మన మెంతయో యదృష్టవంతులము. వీరు హిమాలయమందలి యోషధుల మహిమవల్లను, సిద్ధులచేతను సర్వభక్షకులై వెలయుచున్నారు. ఏమితిన్నను

వీరికి జీర్ణమగును. ఇనుపమేకులు, గాజుపెంకులు, గంధక ధృతి, మహాద్రావకము, వీనినన్నిటి నవలీలగ భక్షించినాడు. ఎఱ్ఱఁగాఁ గాలిన నినుపమొద్దును నవలీలఁగాఁ బట్టినాడు. చేతులు కమలలేదు. ఈమహానీయు లీప్రాంతములకుఁ జనుదెంచి మన కొండలయం దనేక దివ్యౌషధము లున్నవని పూర్వమునుండియు వినికిడియగుటచేత సర్వమానవోపయోగమైన, హేమమును, వారు చేసుకొనుటకు నేర్చుకొను గతియేదియని నరయఁ జరించుచున్నారు. మహానీయుల మార్గములు మానవరక్షణోపయుక్తము లేగదా అని కూర్చుండినది. అట నున్న భక్తులందఱు నారాయణరెడ్డిస్వామికి జయ్! యని యనుచున్నారు.

---

## 7. కొండవీడు - రెడ్డిస్వామి

కొండవీటి త్రికూటమధ్యమున నున్న నా తటాక పశ్చిమభాగమున దూర్పుద్వారములు గలి వేమనమఠ మల రారుచున్నది. దీనిని గురుమందిరమని బిలుచుచుందురు. పెద్దరాతిదద్దళము గట్టబడియున్నది. దానిముం దంతరాళ మంటపము చుట్టు గోడ గలిగియున్నది. మందిర సింహ ద్వారముముందు ముఖమంటపము, దానిపైఁ జంద్రశాల ప్రక్కగా సోపానపంక్తియు నలరారుచుండును. అప్పుడప్పుడా చంద్రశాలయందు వేమనయోగీంద్రులవారు సమాధియం

దుండుచుందురు. అంతరాళ పైభాగమున నూరుగురుండుట కవకాశము గలదు.

ఈ గురుమందిరమునకు దక్షిణమున సత్ర మొండు గలదు. సత్రమున కెదురుగా నొక చిన్న డాబా గలదు. దీనియందుఁ రాకుమారి సమాధినిష్ఠయందుండుటకు నిర్మింపఁ బడినది. సత్రమునకుఁ బశ్చిమమున నొక బావి గలదు. దీనికిఁ బశ్చిమమున నారామ మొండు గలదు. ఈ వనము నాలుగు వందల గజముల యాయామముగల్గియుండు. దీనియం దుత్తర ముగాఁ బాకశాల గలదు. ఆవనమందున్న రెండు నిమ్మలు, రెండు దబ్బలు, రెండు నారింజలు, రెండు మామిడులు, రెండరంటులు,తులసివనము లెక్కింపనశక్యమై యీకొండపై నింతటి యారామావకాశము దొరకినందుల కప్పుడప్పుడు వచ్చు భక్తు లానందించుచుంద్రు.

తోట మధ్యయం దొక స్థూపము కలదు. మహనీయులు గతించిన వారియస్థులపై భక్తివిశ్వాసములతో నా మహనీయుల చిహ్నములుగా నొక మందిరము నిర్మింతురు. దానికి స్థూపమని పేరు. ఈ స్థూపము నాశ్రయించియే యీ వన సత్ర మఠాదులు నిర్మింపఁబడినను వేమనయోగీంద్రు లప్పుడప్పుడు వచ్చుటచే వేమనమఠమని యందురు. కాని ముందువచ్చిన చెవులకన్న దరువాత వచ్చిన కొమ్ము లెక్కు డనునట్లు వేమనయోగీంద్రులవా రెప్పుడైన నొక్కసారి వచ్చుటచే మూలపురుషుని యనుయాయి లేకొలదిమంది బీదవా రగుటచేఁ గొలదికాలముక్రింద వచ్చిన నారా యణరెడ్డి స్వాములవారిని, ముఖ్యులగు నరసరెడ్డి రాకుమా

ర్యాది భక్తు లభిమానించుటచే నీమందిరము నారాయణరెడ్డి మందిరమనియు, నీరెడ్డిగారు దత్తాత్రేయ ప్రతిష్ఠఁ జేయుటచే దత్తమందిరమనియుఁ బేరు గాంచుచుండెను. తిరుమలగురు మందిరము చివరకు నారాయణరెడ్డి మందిర మగునది. త్యాగులచే నిర్మింపబడిన మందిరము లిట్లన్యాక్రాంతము లగుచుండ, మారు పేరులందుచుండ, నిజమెరుఁగువారు, భాగ్యసంతుల దయొతీడి, ప్రతిభ యీ మందిరముల పైన గూడ వ్యాపించుచున్నది. కాసింతని యసంగీకారము నడంచుకొనుచుందురు! వేమనయోగి మఠనామమయిన మారవలయునా?

సర్వము త్యజించిన యోగిరాజు వేమనకిత్రే మి? వాకి లేమి? మఠమేమి? మందిరమేమి? ఏమియు లేనివారి కేమియు నక్కఱలేదు. కీర్తి ప్రతిష్ఠలు గోరువారి కన్ని యుండవలెను. ప్రపంచసుఖముల నౌన్నత్యముల వాంఛించువారే యాలయముల మందిరముల నిర్మించి ధర్మము ధర్మమని ధనము వసూలు చేయుచు, భక్తులలీల సంచరించుచు, వేలకువేలు సమకూర్చుచుందురు. మహారాజులలీల నారామసంచారు లయ్యెదరు. తనకున్న బెట్టవలయు, లేకున్న గూర్చుండవలయు. పరులవద్ద మొగమోటమిచేతనో, చంద్రుఁడ వింద్రుఁడ వనియు నుబ్బించుటచేతనో వడయు పసిడివలన ఫలితమేమి? నీ భక్తి హృదయారవిందముల నుండవలయును గాని బాహ్యాటోపములచేఁ జూపిన లాభమేమి? అందుచే వేమనయోగి స్వయముగా మఠము గట్టించుకొనలేదు. కాని మహాసీయుఁ డామందిరమున డెందము నిల్పుకొనుటచే గాబోలు సద్భక్తులయందుఁ బండు పండ్లు, పత్రములు, పుష్పములు

గానిపించు. అదియే వేమనయోగికి మఠమున కంతటికి మహాత్మ్య మొసంగుటకుఁ గారణము. మఱియు వేమన వెఱ్ఱిపుచ్చకాయలుఁ బండించుటయు, నందఱు వెఱ్ఱివేమన యనుటయు, వానిని బగిలింప హేమమయమై యుండుటయు, నతని సిద్ధవేమన యనుటయు, నందఱెఱింగినదియే. మహానీయు లెద్దానినైన జేయ శక్తివంతులు.

మానవుల కింతటి శక్తిగలదా యనిన నవీను లనుమానింతురు. ఏ యైరోపీయనుఁడో యట్టిపని సేయఁగా నాలకించి వారు మహానీయులందురు. ఎవ్వఁడైనను మనవారట్టి కార్య మొనరించిరనిన యాకర్ణించి పూర్వమంగీకరింపని వారలు "మనవారు నెఱుఁగుదురు. కాలగర్భమున మాఱు మడగినది. మన దౌర్భాగ్యమున కేమందుమని" విలపింతురు. విచారించి చూడుఁడు. పూర్వము మానవ, దేవ యక్ష రక్ష, గంధర్వాది జాతులు విమానములపై విహరించిరనిన, విగ్రహాము లొనరించిరనిన విపరీతముగాఁ బలుకువారు; అవి ప్రాతపురాణము లనువారు; నేడు మన పురోన్నత్యమునకు ముఱియుచున్నారు. కాని యభిమానించుట లేదు. శాలివాహనశకము 1836 (క్రీ. శ. 1914) కాలమునుండి ఐరోపా మహారణమున మారణమున కుపయోగించిన బరాసు, జర్మనీంగ్లీషువారల వాయువిమాన వార్తలు వీనులఁ బడినప్పటి నుండియు మనదేశమున మద్రాసు, నెల్లూరు, బ్రాహ్మణకోడూరు, గుంటూరు, గనాత్కూరు, బెజవాడ, యేలూరుల మీఁదుగాఁ గలకత్తాకు ప్రయాణమైన వియద్యానములఁ గన్నారఁ గాంచిన యనంతరము మన భారతీయ పురోన్న

త్యమును విశ్వసించి పులకితగాత్రుల గామా! సముద్రాంతర గాముల వార్తలుఁ జనువుచూడుట లేదా?

అమెరికాలో శాస్త్రవాశోధకులచే నన్ని ఋతువుల ధర్మములును జూపింపఁ బడుట లేదా? ఇమిటేషన్ వజ్రములు, నిమిటేషన్ బంగారమును గమనింపమా? కుక్కల, పిల్లుల ప్రాణముల దీసి మఱలఁ ప్రాణములఁ బోసి కొన్ని నిముషములు బ్రతికించు వార్తలు శ్రవణపుటగోచర మగుట లేదా? ఒక్కొక్కఁడు నెలదినములు వాయువుల బిగించి భూమియందు బూడ్చఁబడి తీయఁబడి యనంతరము వర్తించు విషయముల నాలకించుట లేదా? సర్వభక్షక మహాయోగి (1924—1930) మద్రాసునగరంబున నిపుడు నివసించి యినుపమేకుల, గాజుముక్కల, గంధక ద్రావకముల త్రాగి జీర్ణించుకొనుట లేదా? జనులు కనులారా గ్రహించుట లేదా? ఇట్టి ప్రత్యక్షప్రమాణము లెన్నియోనుండ, మనము పూర్వ యోగులశక్తిని విశ్వసింపఁజాలమా? మానవశక్తిచే రోగముల మాన్పువారల, భూతభవిష్యద్వర్తమానముల వచించు వారల, గాంచుచున్నమనము, సిద్ధులు, నిరహంకారులు, నిరక్తులు, త్యాగులు, భగవద్భక్తులు, యోగులెట్టి శక్తిమంతులో వర్ణింపనేరమా?

నారాయణాచార్యస్వామి యొకరిని బీడింపరు. ఒకరిని నిందింపరు. తాను స్వయముగ భిక్షమునకు వెళ్ళి, తెచ్చిన మధుకరము శిష్యులగువారికిఁ బెట్టుచుండును. ఎందఱోవారి ప్రసాదమునకై వేచియుందురు. గురుప్రసాదమున మహోత్కృష్ట మహిమకలదనియు, బసవడు గురుప్రసాదజనితుఁ

డగుటచేత జంగమమత నిర్మాణకర్తయగు మహనీయుఁడయ్యెననియు, జనులు సద్భక్తిని సన్నుతింతురు. వారిశిష్యులు ముండితశిరస్కులు, పునిస్త్రీలయినను నీనియమమే పాటింతురు. వారిముఖ్యశిష్యులు మువ్వురు ఒకస్త్రీయు, నిరువురు పురుషులును. వీరిది నందియాలసీమఁట. వారు గురువుతోఁగాక యొండొరులతోఁ బలుకరు. వారిలో వారును బ్రసంగించరు. మౌనస్కులట. రాత్రింబవళ్ళు ముసుగులతోఁ బరుండుదురు. లేనియెడల నిచ్చవచ్చినచోటికిఁ బోవుదురు.

నారాయణరెడ్డి స్వాములవారు లక్షాధికారియనియు నన్న దల్లి యున్నారనియు, వేమన శిష్యులున్న కడపజిల్లా కటారుపల్లె సమీపగ్రామ నివాసులనియు, వీరిని (నెల్లూరు) సింహపురిప్రాంతము శిష్యులున్నారనియు, సర్వము త్యజించిన మహాయోగియనియు, జనులాడుకొనుచు, వారిదయావాత్సల్యములంద యత్నించుచున్నారు. వేమన యోగీంద్రుఁడు లేఁడా? అన్నచో నాతఁడు తఱచుగా దేశసంచారము సేయుచుండును; శిష్యులచిత్తము ననుసరించి పోవువాఁడుగాఁడు. మఱియు పొరుగింటి పుల్లకూర రుచికాదా? ఈ నారాయణార్యులు శిష్యుల యాలోచన ననుసరించియుఁ జరించుట గలదు.

నారాయణార్య రెడ్డిస్వాముల నాశ్రయించినవారిలో సూరపరాజు, శారద, రాకుమారి, మల్లాది నాగ దేవరార్యులు ముఖ్యులు. వీరు హఠయోగముల నభ్యసించుచున్నారు. ఆసనములు వేయుచున్నారు. పలువిధములగు చెట్టుక్రియలు, పసరుల రహస్యము లెఱుంగుచున్నారు. చెట్టువేరును నోటిలో నుంచుకొని నల్లనిగుండ్ల బెల్లఁపుఁబొడివలె నములుచున్నారు.

ఇనుముపై వేరురసమునుంచి గోళ్ళతో గీకి విఱుచుచున్నారు. యోగవిద్యను, సిద్ధవిద్యను, వైద్యవిద్యను గొలది కొలదిగా సంగ్రహించుచున్నారు. మహనీయుల నాశ్రయించిన గణనీయులు గాకుందురా! విచిత్రములగు పనులు యోగముల మూలమున, నోషధులమూలమున నగునని వారియూహ. అందుల కొనలయు వేరులు సంపాదింపుచున్నారు. రసములమర్దించి పుటము పెట్టుచున్నారు. కొన్ని శ్లోకముల కర్థము దీయుచున్నారు.

శ్లో॥ శుక్లాంబర ధరం విష్ణుం । శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్న వదనం ధ్యాయే । త్సర్వవిఘ్నోప శాంతయే॥

తా॥ శుక్ల=తెల్లనిది పాదరసమును; అంబర=ఆకాశము నిలిరంగుగలది మైలతుత్తమును; ధరం=భూమి భూమిసంబంధమయినది సీసమును; విష్ణుం=నల్లనివాడు లోహము=ఇనుమును; శశివర్ణం=తెల్లనిది వెండియును; చతుర్భుజం=చతుః=నాల్గుసార్లు, భు=పోర్లించి, జం=పుట్టించగా (అనగా నాల్గుసార్లు పుటము పెట్టగా) ప్రసన్న వదనం=సంతోషమైన ముఖము గలుగును. ధ్యాయేత్=ధ్యానింపగా అనగా ఆలాగున జేయుగా; సర్వవిఘ్న ఉపశాంతయే=అన్నికష్టములు అనగా దరిద్రములు ఉపశమించుచున్నవి, అనగా ప్రకాశమొనరింపగా బంగారమగునని యు, బెడర్థములు దీయుచున్నారు విద్వాంసుఁడు, ఉద్దండకోలాహలయను బిరుదులందినవాఁడు, తర్కశాస్త్రపండితుఁడు, తర్కించుటలేదు. అవి యోగులకే యాలాటి మహిమలుగల రెండవయర్థ మొసంగునేమో అని. వెఱ్ఱియా! కర్మమా! ఏమో!

గ్రద్దగ్రుడ్లను తీయుచున్నారు. ఒకదాని యందలి రసమును దీసి, పాదరసముదీసి మఱుల నా గ్రుడ్లను నా గూటి యందుంచుచున్నారు. ఆ గ్రుడ్లనా పొదిగిన నొకటి పిల్లయగును. రెండవది పాదరస గుళికయగును. ఈగుళిక యదృశ్య మహిమాన్వితయట. సిద్ధులంద దలచినవారు షట్చాస్త్ర ప్రవీణుఁడు నాగదేవరార్యులు, రాకుమారి చంద్రకుమారి, వారికి నేర్పించువాఁడు నారాయణార్యరెడ్డి స్వాములు, నివసించునది సర్వౌషధ నిలయమగు కొండవీడు. తరుగేమి? ధనబలము, జనబలము, బుద్ధిబలము, విద్యాబలము, యోగబలము, మానబలము, భావబలము, చివర కలబలము.

నారాయణార్యరెడ్డి స్వాములు, శారద, సూరపరాజు లప్పుడప్పుడు, యీ నాగదేవరార్యులు కొండల దిరుగుదురు. శస్త్రాగారములు, మందుకొట్లు, బురుజులు, సెరుపులు, సారంగములు తిలకించుచున్నారు.

---

## 8. మాచర్ల, సుమతము.

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాన్
రుక్మాంగదార్జున విభీషణ హనుమద్బలీంద్ర
పుణ్యానిమాం పరమభాగవతాం స్మరామి.

అని యొక యువతి మాచెర్ల చెన్నకేశవ స్వామివారి

దేవాలయమునందుఁ బరివేష్టించియున్న, హర, నారీవారమున కెదుట నిలువబడి నిర్మల మనంబున ధ్యానించి, వారల నుపలక్షించి, నమస్కరించి యిట్లు వచించుచున్నది.

మేము శివపూజా ధురంధరులమైనను, మాకు వైష్ణవులయం దసూయలేదు. విరోధములేదు. మాకు శివ, కేశవులు సమానులే. ఒక భగవంతుఁడే యెవరే రూపమున ధ్యానించినవారి కాయారూపంబులఁ గాన్పించుట నిశ్చయము. పలువురు మూర్తు లున్నారుగదా? వారిని పూజించు నామావళి నాలకింపుము. ప్రతి దానియందును నేవియో కొన్ని నామములు దక్క తదితరము లొక్కటియే.

హనుమన్నామావళిని గాంచుడు. రామదూత, అంజనీదేవిపుత్ర, కేసరీతనయ, లంకాచండీ మొదలగు వ్యక్తి నిరూపనామములు దొలగించి తదితరముల నొకచో నుంచుఁడు. పిదప శివనామావళిని దీయుఁడు. దానియందు, త్రినేత్ర, త్రిశూలి, పార్వతీపతి, వృషభవాహన యను వ్యక్తిపరములగు నామములఁ గొన్నింటిని దీసివైచి మిగిలినవి యొకచో నుంచుడు. ఈలాగుననే విష్ణునామావళి; గణపతి నామావళి; గురునామావళి; దేవీనామావళి; యను వానినెల్లను నీలాగున బరిశీలించినచో నాయా దేవదేవుల ననుసరించి పదములును, లింగవిభేదము గలిగియుండుటను గాని యేకార్థములనియు, నొక తరగతి వేయనియు, నొకటియనియుఁ దెలియగలము. ఒకదానిని వినుము.

జ్ఞానస్వరూపా యని శివకేశవాదిమూర్తులఁ బిలుతుము జ్ఞానస్వరూపిణే యని దేవీమూర్తులఁ దలతుము.

వారుగాని, వీరుగాని జ్ఞాన మూర్తులంట. దేహరూపులు గారంట. వారి యాకారము జ్ఞానమంట. జ్ఞానమనగాఁ దెలుసుకొను జ్ఞానమే. తెలుసుకొను తెలివియే యిది పృథివి, జలము, నిప్పు వాయువాకాశములలోఁ జేరినదికాదు. ప్రపంచములోఁ జేరినదికాదు. దీనిని తెలుసుకొనినది. అట్టి యీ జ్ఞాన మాడదియనిగాని, మగవాఁడని గాని ఎఱ్ఱది, నల్లది, తెల్లది యనిగాని, వచింపగలమా? అది యూహకుఁ దెలిసి తెలియకున్నది. ఊహకందని యందకున్నది. చరాచరమంతయు నీ జ్ఞానమునకు లోనైన దగుచున్నది. ఆ జ్ఞానమే భగవత్స్వరూపమని యన్ని మతస్థులుఁ జెప్పుకొనుచుఁ దాము వచించు శబ్దార్థము తామెఱుంగక, తెలియమాని యజ్ఞానుల కొరకేర్పడిన మూర్తులనే నిజమగు దైవములని నమ్ముట తటస్థించుచు వచ్చినది.

ఆనామము లన్నియు నిరాకారాయనమః - నిర్వికల్పాయనమః — విశ్వరూపాయనమః — విశ్వరక్షాయనమః — యనునట్లుగా, నిరాకార తత్వమును బోధించుచు సూచించుచున్నవి. సాకారమును బోధించుటలో నీలోకమే భగవంతుని రూప మగునట్లును, నింక నీలోకమున కాధారమగు శక్తి (Force) రూపమున నున్నట్లును, వర్ణింపఁబడు చున్నట్లు గాన్పించును. వివిధమతస్థు లొక్క భగవత్తత్వమును మాత్రమునే వారివారి యిచ్చాను సారముగ రూపగ్రహములఁ గల్పించి పూజించుచు నున్నారు. స్వభావసిద్ధమగు రజోగుణప్రేరితులమై, బాహ్యాచారముల నవలోకించి, భ్రమించి తమ మతమే శ్రేష్ఠమనియుఁ, తదితరములు నీచ

ములనియు నుపన్యసించి యమాయకులగు ప్రజల ననేకావ
స్థలపా లొనరించుచున్నారు.

ఒక్క కులమునందే యీ మతబోధకుల జాతివిభాగ
ముల గల్పించుచున్నారు. సహపంక్తి భోజనముల నయితము
మాన్పించునంతటి యభిమానాహంకార పూరితములుగూడ
నగుచున్నవి. నిలువుబొట్టువా రడ్డబొట్టువా రొక్క కులము
నందు బంధువులందరు లేరా ? అట్టివారి నీమూర్తి మతాభి
మానప్రచారకులు గంభీరోపన్యాసము లొసంగి, వారల
కలగుండుపఱచి, చెఱచుచున్నారు. ఈ విభేదముల కవకాశ
మున్నదేమో జ్ఞానస్వరూపుఁడు నిరాకారుఁడగు భగవంతుని
దలంచి నేను వచించు దృష్టాంతమునకుఁ బోల్చుకొని సరి
జూచుకొనుఁడు.

ఒక నీటితొట్టి కారుమూతు లున్నవి. దానికి నొక
సామాన్యమూర్తియు, శివ, కేశవ, దేవి, క్రీస్తు, బుద్ధ, అల్లా
మూర్తులు చిత్రింపబడిన మూతులు బిగింపఁబడినవి. ఆ
తొట్టిలోని నీటిని నోటిని జేర్చవలయునన్న నామూతులలో
నొకదాని శీలను ద్రిప్పి త్రాగనగును. ప్రయాణీకులు వచ్చు
చున్నారు. వారియందు రోగులున్నారు. వారు చేతికిఁ
జిక్కిన మూర్తిశీలను ద్రిప్పుకొని జలమును ద్రావుచున్నారు.
తమమతమందు పట్టుదల గలిగిన నాయా మతస్థులు వచ్చిరి.
వారు తదితరమూర్తులను హేయముగా, నసూయగా జూచి
తమ మతోత్కృష్టపూజామూర్తియగు నామూర్తిని గాంచిన
వెంటనే లెంపలు వాయించుకొని, నమస్కరించుకొని, దాహ
ముదీర్చుకొని యానందించుచున్నారు. ఒకనిని జూచి ఆర్యా!

నీ వీ యానంద మెట్లు పొందితివని యడిగిన నతఁడు సోదరా! కేశవమూర్తిదయాకలిత రసపానంబున పిపాసాబంధముకుండ నైతి. యానందమందితిని. నా యనుభవమిది. మీరును కేశవునే ధ్యానించుఁడు; తదితర మూర్తుల దలంపకుఁడు. అవస్థల పాలుగాకుఁడని బోధించి, పిపాసాబంధ ముముక్షువులను దన ప్రక్కకే లాగుచున్నాఁడు. ఈలాగుననే ప్రతివాదును, దాను బూజించు ప్రతిమనే పూజింపుమనియుఁ, తదితరములు లాభములుగావనియు బోధించుచున్నారు. ఆయా జను లాయా విభాగములై వారి మార్గదర్శకులతోఁబాటు మా యనుభవము సరియైనది. మాకు తృప్తియైనది. మీకు కాలేదు. మీరు నరకగాములని పోరాడుచుండిన నెట్లుండునో విచారింపుఁడు! వారందరా మూర్తులనే గాంచుచున్నారుగాని, దానినుండి రాబడిన రసప్రవాహము నవలోకించలేదు. చూడఁగా నన్ని మతములయందు నడక నొకతీరుననే గలదు. నిజముగా నందఱును నేకముగా పిపాసావిముక్తులయినట్లుగా, నే మూర్తిని ధ్యానించినను, పూజించినను, ముక్తి నందఁగలమని నమ్ముఁడు. కాదుకాదనినచో, నా కథలోని యజ్ఞానుల మాదిరిగానని, యనవలసివచ్చునుసుమా! మూలతత్వము నెఱుంగఁజాలక పోయితిమని యనవలసివచ్చుచున్నది. మఱియు నింకొక విషయమును బాగుగా గమనించి మీస్వాంతములఁ జింతనజేసి చూడుఁడు.

వైష్ణవు లేమని బోధించెదరు? కన్నులకుఁ గాన్పించు సర్వమూ శ్రీమన్నారాయణమూర్తియే యని బోధించెదరు గాదా! తా నట్లు భావించుచున్నాఁడా! తనకుఁ గాన్పించు,

శివ, దేవీ, శాక్త, క్రీస్తుభక్తులా శ్రీమన్నారాయణమూర్తియే యీలాగున గాన్పించుచున్నాడని గ్రహించిన దనకు సకల మత సమదృష్టి కలుగుటలేదా! అట్లుకానిచో, నాలాగున తలంపనిచోఁ దాను తన సూత్రమును ద్రోసివైచినవాఁడగుటఁ దా నెట్లు శ్రీమన్నారాయణ భక్తుఁడగును? ఆలాగుననే శైవులకు సర్వలోకము శివరూపమే యగును. వా రితరులఁ బరులన్న దాము శైవులుగారు. ఆలాగుననే తదితర మతస్థులు తమతమ మతములయందుఁ జెప్పఁబడిన విశ్వమూర్తి రూపము గాంచియే వరులని భ్రాంతిపడి యుద్ధము చేయుచున్నారు. అట్టు దలంచుట కవకాశము లేదుగదా! అందరమూ భగవానుని యంగములమే! మతాచార్యులలో నిజమగు మహనీయులు సర్వమతసమ్మతమగు మార్గముల సంచరించుచు నిజమగు రూపమును, నిరాకారమును, విశ్వరూపమును ధ్యానించుచు, సమానందానందకంపితహృదయులగుచున్నారు. కొందఱితరులకు బోధించవచ్చు నప్పటికి దమ మతస్వభావముల విడువఁజాలక, యాచారములతోఁ గట్లు, జుట్లు, బొట్లుతోఁగల విభాగము నాచరింపఁజేయుటలోనే ప్రయత్నించెదరుగాని, నిజమగు నాంతర్యవిషయమును బోధించుట లేదు. చింతనీయము.

ఇట్టి విభేదదృష్టిచేతనే యీచరిత్ర విఖ్యాతమగు నీ పల్నాటిసీమయందు శ్రీ బ్రహ్మనాయఁడు వైష్ణవమత నాయకుఁడై శ్రీ నాయకురాలు శైవమత నాయకురాలై మాచర్ల గురిజాల రాజులకు నియామకులై ఘోరయుద్ధమును గారెంపూడివద్ద జేసిరి. ఫలితము పల్నాటి ప్రజావినాశనమే

గదా! ఇట్టి ఘోరమారణకార్యములు శివ కేశవుల కిష్టమా ? పురాణములందుఁ బఠించుట లేదా! శివుని విష్ణుమూర్తి భగవంతునిగా స్తుతించుటయు, విష్ణుని శివుడు దేవునిగాఁగీర్తించుటయు, నొకరినొకరు గౌరవించుకొనుటయు, నొకరికొకరాలోచించుకొనుచు దురాచారుల దూలించుటయును; వారిలోవారికి సమానత్వమే కాన్పించును.

మీ మాచర్ల రాజ్యము శివభక్తులమును, వృషభధ్వజులమునగు మా స్వాధీనమయినను, మా జనకులగు శ్రీయుత వేమారెడ్డి ప్రభువులును, మా పెదతండ్రి కుమారులు యువరాజులునగు శ్రీ కుమారగిరి వేమారెడ్డి ప్రభువుగారును, సకల మతస్థులు వారివారి మతానుచరులై సంచరింపవలయుననియు, నెవరికెవరును నిక్కట్టులఁ గల్పింపరాదనియు, నితర మతముల దూషింపరాదనియుఁ నాజ్ఞాపించియున్నారు. ఈ రాజ్యమందు జైనులు, బౌద్ధులు నివసించుచుండుట నవలోకించుచున్నారు. మా రాజ్యమునందు ధాన్యకటక పశ్చిమప్రాంతమున హుసేన్ యను నొక మహమ్మదీయునకు, హిసార్ బాదాయను నొక యగ్రహార మొసంగఁబడి యాతని మతమును బోధింపబడుచున్న విషయ మెఱుంగుదురుగదా ! మళయాళప్రాంతమునుండివచ్చిన యొక క్రైస్తవబోధకునకుఁ గొంతభూమి నొసంగి యీ యేసుమతమును బోధించుట నెఱుఁగరా! శ్రీ వేమనాది యోగీంద్రుల సర్వమతసమ్మతమే మన కేడుగడయనియుఁ బ్రజాశాంతికీ ముక్తికి మార్గములనియు దెలుపలేదా!

త్యాగులు విరాగులందఱు, యేమతమువారినైన నొక

కీతి నాదరించుట మోదావహము. భగవంతునికి మనజాతి, మత, కుల గోత్రములతో సంబంధములేదు. ఈయవి మన యభిమానాదులతోఁ గల్పింపబడుచున్నవి.' కాన మీరు నిరహంకారులై చరింపగోరుచున్నాననియు, వచించికూర్చుండెను.

ఆప్రాంత ప్రజానాయకుండైన రామచంద్రగురుమూర్తి మూర్తి ధర్మవర మహాధ్యక్షుడు, కమ్మనాయకుడు లేచి పూర్వకాలమున రుద్రమాదేవి యామె సోదరి గణపాంబాయు, ఓరుగల్లను నేకశిలా కాకతీయ సామ్రాజ్యమును, ధాన్యకటక రాజ్యమును బాలించిరనియుఁ బూర్వము విరాగిణియై, యవివాహితయై గార్గియను యోగి యున్నదనియు, నాలించుచుండుము. నేడు మనము రుద్రాంబికా, గార్గిమూర్తుల నేకదేహమున శ్రీరాకుమారీ చంద్రికుమారీ రూపమున గాంచుచున్నాము. మనము వారిబోధనల శిరసావహింతము. ఎత్తితోతలఁ జూడవచ్చుటచే మనకు శ్రీవారిదర్శన మబ్బినదని ప్రజాసముదాయపక్షమున హర్షము వెలిబుచ్చెను. జనులందఱు జయ్ రాకుమారి చంద్రికుమారికి జయ్ యనుచున్నారు.

# 9. ఎత్తిపోతల, దైవచింతన

గుంటూరు కర్నూలుజిల్లా సరిహద్దున కృష్ణానదీతీరమున శ్రీశైల పర్వతశాఖలు గలవు. వాని యుపశాఖలు పల్నాటికి పశ్చిమమున వ్యాపించియున్నవి. ఈ భాగముననే మాచర్లసీమయున్నది. ఆ శ్రీశైల శాఖాప్రాంతములనుండి బయలువెడలిన చంద్రవంకనదియు మాచర్లపురి నానుకొని పూర్వోత్తరములుగాఁ బాఱుచుండును. సాధారణముగనన్ని కాలములయందు నీరముండుటచే జీవనదియన నొప్పును. ఇందలిజలము వర్షాకాలమునందనేక చెఱువులయందు నిలుప యుంచబడి వరిపంటకవకాశ మొసంగుచున్నయది. ఇదిబాలచంద్రుని వంపుగలిగి యుండుటచేతనుఁ బూర్వమున స్త్రీలు నెత్తిపై ధరియించు చంద్రవంకయను భూషణమును బోలి యుండుటచేతను, నీనదికిఁ జంద్రవంకయనునామ మొదయించె నందురు. అంతనుపూర్వము వంకయనియే దీనికిపేరు. చంద్రకుమారి నామముఁజేర్చి చంద్రవంకయని స్మారకచిహ్నముగఁ బిలువసాగిరి.

ఈ చంద్రవంక విరజానదిగ, మాచర్ల వైకుంఠనగరముగ, కేశవాలయము విష్ణుసదనముగ, నాప్రాంతమువారు వర్ణించుకొనుచుందురు. మఱియు భాగీరథీ నది కేశవుని పాదములనుండి బయలువెడలి యాకాశగంగా మాఱి క్రిందికి బడునట్లు నీనదియుఁ జెన్నకేశవస్వామి పాదసన్నిధినుండి ప్రవహించి మూడుమైళ్ళేగి యెత్తిపోతల యను పేరుతో నాకాశగంగా మాఱుటచేతఁగూడ తెఱచుగాఁ గవులు పిచ్చిగుంటలవారు దీని నీలాగు వర్ణింతురు.

చంద్రవంక మాచర్లను దాటి వాయువ్యమునఁ బ్రాతి తటాలున నొక గొప్ప గుంటలోనికి దుముకుచున్నది. ఆ ప్రాంత మొకయగాధమగు నొకలోయ. ఒకమైలు పొడవును నూరు మొదలు మున్నూరు బారలు వెడల్పు గలిగి యుండును. దానిలోనికేగుట కాగ్నేయ భాగమున మెట్లుగలవు. దానిమార్గమున దిగుచున్నఁ బ్రక్క దేవాలయములు, గుహలు గాన్పించును. క్రిందిభాగమున బోకలు, నారికేళ ములు, తాళవృక్షము లసంఖ్యములుగాఁ గలవు. అరఁటి వృక్షములు సర్వకాలముల గెలలు సలుగెలఁ కులకుఁగనుపింప చేయుచు నవనవలాడుచుండును. వీనికి నుత్తరమునసే నది యీలోయలో దటాలున బడునది. అట ముప్పది, నలుబది యడుగుల యెత్తునుండి క్రిందికిఁ బడుచుండుటచేత నాధ్వని ప్రతిధ్వనులతోఁగూడ నిరంతరపర్జన్యగర్జన మనుకరించుచుండు ననుట యతిశయోక్తిగాదు. వర్షాకాలమున నాసీరములు నూఱుగజముల వెడల్పునను ధారలు వీడుచుండును. నీటి కరుళ్ళు చిటచిటమని పైకి లేచుచుండును. నురుగులు పరుగు లెత్తుచుండును. నీటితుంపరలు ప్రళయసమయవర్షము ననుక రించును. అటనుండినవాని కిరుప్రక్కల నాకాశముల కంటి యున్న మహోన్నత పర్వతరాజములు, వానిపై కీఱ్ఱుమని ధ్వనించు సుదీర్ఘ వేణువృక్ష సముదాయములు, జంబుజంబీర తాలహింతాలాది తరుజాలములు భయంకరముగ వివిధ లతానికుంజంబుల వానిపై నిజకాంతుల వెదజల్లుచు, సౌరభ ముల వెలయించుచుఁ బ్రకాశించు పుష్పము లానందము నొందించుచుండు.

ఆలోయం దానది వాయువ్యముగాఁ బాఱుచున్నది. ఉత్తరముగఁ దిరుగుచున్నది. అట విశాలప్రదేశము లేదు. చట్టుపైననే. ఆప్రాంతము దాఱుగురు మాత్రమే దేనినో వెదకుచున్నారు. వారిలో నొక కాషాయాంబరధారి మహాశ్చర్యముగా నొకచోట వ్రేలుఁజూపి యిట్లనుచున్నాడు.

ఆహాహా! ఆ మహాపవిత్ర వృక్షమును గన్నారఁగాంచితిని. దేనిని వేమనయోగీంద్రుఁడు గనిపెట్ట నితంతర శ్రమ వహించుచున్నాఁడో, దేశదేశములు, గుట్టగుట్టలు, నట్టడవులు సంచరించుచున్నాఁడో, దేనికై నేను నాయాయుస్సును ధారవోయుచున్నానో, దేనిని గోమటి వేమన తన కావడి యందు మూసితెచ్చి మీపూర్వు లద్దంకి యందుండఁగా వారి కావడియందు దాచి, మీపూర్వుల చాకచక్యమున మోసమున దానిని గోల్పోయి మండుచున్న నాశాలయందు దుమికి, మ్రగ్గి దయ్యమై మీవారికిఁ బట్టి మీవారందరికిఁ దననామధేయముఁ బెట్టించుకొని యిలవేల్పులయి వెలయుచుండెనో తన కరియగు నల్లారెడ్డి మనుమఁడగు యోగివేమన నాశ్రయించి తానే యతఁడుగా వెఱ్ఱివేమనగా, యోగివేమనగా సంచరించుచున్నాఁడో ఆకోమటి వేమనయోగీంద్రుల వారు కష్టపడి కని పెట్టిన యమూల్యనిధి. లతానిక్షేపము. పరుసవేది. ఆ యంభోరుహమును సావరించుకొని క్రమ్మి చొండతీగవలెఁ గాన్పించుచున్నయది.

జయ్ గురునాథా జయ్! తిరుమలనాథా! జయ్ వేమన యోగీ! జయ్ వీరబ్రహ్మేంద్రస్వామీ! బుయ్ జయ్ శ్రీధర యోగీంద్రా! యని యమందానంద కందళితహృదయారవిం

దము పొందినట్లుగా నటించుచున్నారు.

"రెడ్డిస్వామీ, నాగదేవరార్యా! మనమెంతయు నదృష్టవంతులము." ఏమి స్వామీ? మేము రావచ్చునా.

రె. స్వా. రాకుమారియా? మహాయోగిని గదా? ఆమెకు రారాని ప్రదేశము గలదా? శారదా!

శారద॥ నావిషయమా.

రె. స్వా॥ మీ దంపతులు సూరపరాజు, శారదలు సూర్యశంకరులేగదా ? నేనో స్వామీ?"

రె.స్వా॥ మహేశ్వర సేనానియు, మహాభక్తుడగు నందీశ్వరునివంటి వాడవుగదా చిన్నపురెడ్డి నీకాటంక మేమి ?

అందఱా కొన్సించు లఆ ప్రాంత శైలముల నడచు చున్నారు. పాచిపట్టి కాళ్ళు జారుచున్నవి. పడుచున్నారు. లేచుచున్నారు. రెడ్డిస్వాములు నలుదెసల దృష్టిసారించు చున్నారు. నేలయందు గాన్పించుచున్న మొక్కల తర్న పురుషయుల. దానిని వారిని బెరుక నియోగించుచున్నాడు. వారు విధేయులై శిరము వంచి గురువరుని యోజనమున నున్నారు. ఆ యోగి వీరిని గ్రీగంట గమనించుచుఁ బర్వత శిఖరముల నుపలక్షించుచుఁ గరములఁ ద్రిప్పుచున్నాడు. వారి శిష్యుడుఁగాని చిన్నపురెడ్డి యీ చిఱుమొక్కలఁ బెరుకుటలేదు. వారిని, వారి గురువును విలోకించుచున్నారు. గురువుగారు చిన్నపురెడ్డిని గాంచి ముసిముసి నగవున ముందున కేక పోవుట మంచిది. కాలహరణ మగుననుచుఁ జాలు; నిక బయలుఁ వెడలుడని వారిని వెంటనిడుకొని, యీ ప్రాంతము దాటి కొంత లోపలికిం జనెను. అట విశాలమగు

లోయలేదు. పల్లముగా సున్నితములగు కొండలగుండ నానది కృష్ణామహానదిని జేరుమార్గమే యది. ఇంక కొంచె మరు గగా నా పర్వతముల రెండవప్రక్కయు, నధోలోకమున నున్న కృష్ణవేణియుఁ గాన్పించును.

కొంచెము పైకి వెళ్ళిరి. లతామతల్లిని దర్శించిరి. వారితో రెడ్డిస్వాము లిట్లనుచున్నారు. "నాయందు, నా మాటలయందు ననుమాన ముంచకుఁడు. నే చెప్పుదాని నాల కించుఁడు. నే చెప్పినచొప్పున జేయుఁడు. మంత్రోచ్చారణా యుతిమయినఁగాని మన కది తన నిజస్వరూపమున గాన్పిం చదు. మంత్రసిద్ధ కిది పరుసవేదివలె గాన్పించు. కానిచో దూరమునకు కొండతీగవలె, సమీపమునకు దూసరతీగెవలె గాన్పించి మసల గాసించు. దీని కాంతిని సిద్ధులే గాంచఁ గలరు. మీరందఱు నేడుసిద్ధులగుటకు కొలదికాలములో నా మహాచ్ఛక్తిని, నమూల్యసిద్ధిని బడయుటకు నేను జెప్పఁబోవు మంత్రమును నుచ్చరింపవలయును. అది విచిత్రమంత్రము. సర్వాధికారి యీశ్వరుఁడు. మీరాతని జపించవలయును. దర్శన మొసంగును. నేడు చైత్ర బహుళ అమావాస్య. అది వారము. మంచి పర్వడి. పోయిన నిట్టి దిన మింక రాదు.

అభిమన్యువధనాటిరాత్రి యర్జునుఁడు శిబిరమున నర విందాక్షుని యనుమతిని జపించి పరుండియుండఁగా, నేలీలఁ గైలాసమున కరిగి యీశ్వరుని దర్శించి, పాశుపత మర్థించి, సరోవరంబున మహాసర్పములఁ గాంచి, మంత్రోచ్చాటనచే దాని ప్రయోగోపసంహారముల మూలమున స్వాధీనము గావించుకొనెనో; ఎట్లాతని కా కలరూపమగు విచిత్రజాగ్ర

తానుభవము కలిగినదియో; అలాగుననే మనము జపించు చుండఁగాఁ గలలు వచ్చును. ఈశ్వరుఁడు సిద్ధిని బ్రసిద్ధిఁ బడయనుండువారిని బరిశీలించును. ఆలాపనలు కలుగు. అనేకులు వచ్చినట్లు, కట్టినట్లు, వాహనములఁ గొంపోవునట్లు, నమలపైఁ గొండలపై దీసికొనిపోవునట్లు, కొట్టినట్లు, మొట్టినట్లు, పట్టినట్లు, రకరకముల జలయానముల సంచరించినట్లు, చీకటికొట్లులలోనుంచినట్లు విలోకింతుము. చైత్ర బహుళ యమావాస్య, ఆదివారము. ఇట్టివాసర మికరాదు

ప్రమథు లనేకరీతులఁ బ్రవర్తింతురు. వినోదములలీల ననేక ప్రసంగము లొనరింతురు. లలనలయిచో పరిణయమాడ మనవచ్చును. కలయందు వివాహమాడిన, సంబంధమాడిన మనల బాధింతురా? బాధించరు. ఆలాగుననే మనము వారల నాక్షణకాలమున వివాహమాడి భార్యాధర్మము నెరవేర్చిన నగు నష్టమేమియు లేదు. కలయేగదా బుద్ధులు. మనము కోరునదియు నదియే! స్త్రీరూపమునగాని, పురుషరూపమునగాని, సర్వరూపుఁడగు సదాశివుఁడు గాన్పించి వివాహమాడ మనవచ్చును. మీరు శిరమూపి యిట్లు చరియించుడు. క్షణమేయయినను నొక యుగమువలెఁ గాన్పించుట దైవ విచిత్రము. కలకలయని తలంచుచు గలలో వారు చెప్పు సర్వకార్యము లొనరింపుడు. మీరు మీ పట్టుదలల వదలివేయ వలయును. లేదా! కార్యభంగమగును. మనకు మనల నాశ్రయించి యున్నవారికి హాని గల్గునని” రెడ్డిస్వామి వచించెను. అందరు వల్లెయనుచున్నారు. నిమీలిత లోచనులై తదేక నిష్టతోఁ గూర్చుండిరి. వారందరికేదియో మం

త్రము చెవిలో నూదుచున్నాడు. అందరు హృదయారవింద ములఁ గైలాసవాసుని నుపాసించుచున్నారు.



## 10. రాకుమారి, కైలాసవార్త

మాచర్ల ప్రదేశమునకుఁ జిన వీరభద్రారెడ్డి పాలకుఁ డుగా నున్నాడు. ఇతడు చంద్రకుమారి బాయికి మేనత్త కుమారుఁడు. శ్రీనాథ మహాకవిని యాదరించిన వీరభద్రా రెడ్డి కనుజుఁడు. ఓఢ్రరాజుల నరికట్టుటకై మహాసైన్యముతో రాజమహేంద్ర నగరమున రాజప్రతినిధిగా నగ్రజుఁడగు వీర భద్రారెడ్డి యున్నట్లు; పశ్చిమప్రాంతమున రాచకొండవారి యుద్దండతనుండి కాపాడుకొనుటకు వలయునేని యా రాజ్యాంతర్భాగము జొచ్చి దేశ మాక్రమించుకొనుటకు, సిన్నచిన వీరభద్రారెడ్డి యపారసైన్యములతో నీ నిరంతరజల, సస్యపూరిత ప్రదేశమగు మాచర్ల యందున్నాడు.

ఆటవికులీప్రాంతమున నల్లరిఁ జేయుచుండ సనేకుల నతఁడీ ప్రాంతములనుండి వెడల నడుపుటచేత వారదనుగాచి పీలగు నప్పుఁడచటివారి కపారనష్టము గలుగఁ జేయుచుం దురు. కొండలయందలి చీకటి గుహాలయందు డాగియుండు టయు గలదు. దేవరకొండ సీమాధిపతియు, మిరియాల గూడెపు దొరయు (ఈ రెండు పల్నాటికి పశ్చిమమున ప్రస్తు తము నిజాంరాజ్య మందున్నవి.) బేతవ్రోలు (జగ్గయ్యపేట

కృష్ణాజిల్లా) నేతయు, నీ యాటవిక జనమును మూటముల్లె కొంసంగుచు, భాగ్యవంతుల యిండ్లను, తమ రాజ్యమందైన నను సరియే—దోయించుచుఁ జిన్న చిన్న భూస్వాముల లూటీ కొట్టించుచు—వీలయినప్పుడు వీలగునట్లు తమతమ దుర్మార్గ కృత్యములకుఁ గేలూతగాఁ గైకొనుచు సంచరించుట చేతనే, నీ చిన వీరభద్రారెడ్డి కండ్లన్నియు నా ప్రాంతములయందేయుండును. ఆప్రాంతముల నప్రాంతము విశ్రాంతిఁ గాంచక శాంతము గాపాడునట్టి విశ్వాసపాత్రుల నెందరినో నియమించి సహస్రాక్షునివలె సంచరించును.

ఎత్తిపోతల ప్రాంతములయందలి శాంతిని గాపాడుట కొక చాకచక్యవంతుని బంపమని కొండవీటి ప్రభువులకు వ్రాయఁగా వారు పందెపుఁ గుఱ్ఱమును దెచ్చి తమ కర్పించి కొలువుండి, విశ్వాసపాత్రుఁడని, వీరావతారమని ప్రఖ్యాతిఁ గాంచిన చిన్నపురెడ్డిని నా ప్రాంతములనుండ నియమించి పంపియున్నారు. చిన్నపురెడ్డికి మంచి ఖ్యాతిగలదు. ఎంద ఱెందఱో మీసముల మెలవేసి మాగ్రామముల గుఱ్ఱముల నెక్కి పోరాదని కట్టడిసేయఁగా నొంటిగాడై గుఱ్ఱమెక్కి మొక్కి కఱ్ఱ వేసైనను బొందక దాటివెళ్ళిన మహావీరుడనియు, మంచి రౌతనియు, కిర్రుచెప్పుల దొడిగి యరమైలు వరకా మ్రోత ప్రతిధ్వనింప బాణవేగమున నడువగల గండర గండడనియు; గరడీశాలలయందు లోడీల, నినుపగుండ్లతోఁ బరిశ్రమ నవలీలగా నొనర్చు వాఁడనియు; బొట్టివాడైనను గోడల, మిద్దెల, మేడల, గుట్టలఁ గొండల నవలీల నెక్కఁగల వాడనియు, జనులున్నవి, లేనివి, కొన్ని నానోట నానోటఁ

జెప్పుకొనుటచే నానాట నభివృద్ధియగుచు వచ్చినవి. రాత్రిం బవళ్ళు నిద్రాహారములు లేక సంచరించుట నందరు కనిపెట్టి యప్రమత్తుఁ డందురు.

మాచర్లలోఁ దూర్పుగాఁ జంద్రవంక నదీతీరమున జిన వీరభద్రారెడ్డి కొలువు కూటమున్నది. పెద్దరాతి దూలములతో, రాతిస్తంభములతో నిర్మింపఁబడి యున్నది. కొలువు కూటమునకు ముందుభాగమున నదీసిర ములయందు నాటలాడు కొనుచుఁ దిరుగుచున్న బాతుల జంటల జూచుచున్నాడు. వాని విలాసముల నవలోకించు చున్నాడు. డెందమందానంద మొందుచున్నాడు. ఎదురుగా రాతి తిప్పలపై నదికావల ప్రమదముననున్న గోదమలేళ్ళ గుములగాంచుచున్నాడు. మోదించుచున్నాడు. ప్రాంతమహీ రుహంబుల నిలచి కల కలధ్వనుల బలుకు కలకంఠముల కూతల, నీలమేఘముల ఛాయలఁ బంధములవిప్పి నృత్యము లొనరిం చుచుఁ గులుకు నీలకంఠముల నుత్కంఠత వహించుచున్నారు. నదీ నీరమున తళతళలు కంటి నంటినవి. నీరములతోఁ బాటు త్రిపోతలవరకుఁ జిత్తము పరువెత్తినది. హృదయము తత్తరించుచున్నది. ఇట్లూహించుచున్నాడు.

"చంద్రికుమారియింకను రాలేదు. జాము ప్రొద్దెక్కి పోయినది. పరిజనములను ఎత్తిపోతల ప్రాంతమున నేనుండ నియమించి చిన్నపురెడ్డి నొక్కనినే వెంటనిడుకొని వారెదు గురు నడుగులమీదనే యాలోయలోనికి జనిరట. ప్రకృతి వైచిత్ర్యముల కానందించుచుండ వచ్చునని వారవచ్చినది. ఇంకను జాడ తెలియదు. ఇంకను రాలేదు. ఒంటరిగపోవుట

యుపాయకరము. ఐనను జిన్నపురెడ్డి గలఁడుగదా.

చంద్రకుమారి యెంతటి విద్యావంతురాలు. ఎంతటి వీరురాలు! ఎవని వీరాంగనకాగలదో? ఆభాగ్యము నా కబ్బునా? చినమామ శిష్యురాలైనది. యోగి యయినది. పరిణయమాడనని శపథము పలికినది. ఆమె యదృష్టవంతు రాలు. బీదసాదల బోషించుటలో నాదరించుటలో నాపె ప్రథమగణ్య. సామాన్యురాలివలె సంచరించును. నిరభిమాని తేజస్వి. విద్యావతి. నిర్భయ. వలయు సద్గుణములన్నియు నున్నయవి. వేమనయోగిచే, అనవేమారెడ్డిచే, చంద్రకుమా రిచే మా రెడ్డివంశము ప్రఖ్యాతిగాంచినది.

ఇంకను రాలేదేమి? ఉదయముననే వెళ్ళిరి. ఈ నారా యణరెడ్డిస్వామి యెవరు? సకలవిద్యాపారంగతురాలగు రా కుమారియు, షట్శాస్త్రవేత్తయగు నాగదేవరార్యులును వానినాశ్రయించియున్నారే, పరుసవేది దొరకునని చరి యించుచున్నారు. గిరిపరిసరముల నరయుచున్నారు. పేరాస గదా! ఎవరికేవేళ నేది లభించునో దానికన్న నితరమేమి దొరకగలదు. ఊరక నాకాశహర్మ్యముల నిర్మించిన ప్రబలా యాసము లందవలసివచ్చును.

ఇట్లు వితర్కించుచుండఁ జిన్నపురెడ్డివచ్చి నమస్క రించి; ఆశ్చర్యానుతాపభక్తులు ముప్పిరిఁగొనఁ జినవీరభద్రా రెడ్డితో దేవా! ఆశ్చర్యమాశ్చర్యము. చిత్రము విచిత్రము. విశ్వాసార్హము. వింత. వింతనాలోకించినాడను. మనము మునుకని విని యెఱుఁగము. ఎంతటి యద్భుతము. నాకేమియు బైత్యోద్రేకము లేదు. విభ్రాంతిని బొందియుండ లేదు. సవ్య

మగు నింద్రియజ్ఞానమున నున్నాను. కలగాదు. మతి భ్రమ గాదు. కండ్లారఁ గాంచితిని. చిత్రము. విచిత్రము. ఆశ్చర్య మతి విచారయుత మనెను.

పినవీరభద్రారెడ్డి విపరీతదృష్టితో నేమేమి? యన్ని యనెను.

చి॥ రా॥ ప్రభూ! ప్రశాంతి నాలకింపుఁడు. నారాయ ణార్యరెడ్డిస్వాములును, సూరపరాజును, శారదయు, నాగ దేవరార్యులును, శ్రీ రాకుమారిగారును నెత్తిపోతల జల ధారల స్నానముగావించి, దేవాలయములుసొచ్చి, మూర్తిని బూజించి, పోకతోటను విశ్రమించిన యనంతర మోషధీచ్ఛయ మునుకని, లేచి నీటియంచుల దక్షిణపుమలక్రిందుగాఁ జను చుండిరి. నేనును వారివెంట సంటియే యున్నాను. వాయువ్య భాగమునకు నిలుకుగానున్న నా ప్రాంతమున కేగితిమి. ఇంతలో రెడ్డిస్వాములవారు "అందఱు నేకాగ్రచిత్తులై పసు పతిని ప్రార్థించుడని"యనెను. మేమంగఱ మాచందమ్మన జంద్రధరుని వినుతించితిమి.

భూపాలా! ఆలోన గలిగిన వింత నేమని విన్నవింతు. ఆశ్చర్యము. మమ్మందఱ ధూమమేఘము క్రమ్మెను. అందులో మెఱుపులు మెఱయుచుండెను. అవి యడంగి స్ఫుట మగుకాంతి ప్రజ్వలించుచుండెను. అందనేక విమానములు గాన్పించినవి. అపూర్వ సుందరులగు, నర నారీజనము విమా నములనుండి క్రిందికివచ్చిరి. మనవారందఱిని పరివేష్టించిరి. కర్పూర చందనాగరు మొదలగు పరిమళవస్తువులతో మన వారిని గౌరవించిరి. కాని ఆభాగ్యము నాకబ్బినదికాదు.

ఆ కాంతులఁ గాంచఁజాలక నా నేత్రములు మూతలు పడినవి. మనస్సు చలించినది. భయము గల్గినది. యొడలు జలదరించి నది. వారివాక్కులు, నాకారములు, జూపులు, వీనులవిందులు నయనోత్సవములు. ఆనందకరములు. వారిని కాంచువారు ధన్యులు. నేను ధన్యుఁడ. ధన్యోస్మి. మనవారు

శ్లో॥ దుర్వాసకౌశిక సుకేసి మృకండుపుత్ర ।
దేవేద్య బాణవిధిశక్తి దధీచి రామాః ॥
శ్రీవామదేవ కవికుంభజ గౌతమాత్రీః ।
పుణ్యానిమాం పరమపాశుపతాం స్మరామి॥

యుస్థ వినుతించిరి. ఇంతలో వారిమధ్యఁ జంద్రజటాజూటుఁడు సాంబుఁడు, కుమారసహితుఁడు, బ్రహ్మాచ్యుత హరిహయాది సేవితుఁడు ప్రత్యక్షమయ్యెను. నా జన్మ యీడేరెను. కాంచితిని. నందీశ్వరుఁడు కోటిమూర్తిలో నీశ్వరుని సేవించి యున్నాఁడు. వారందఱు రుద్రాక్షమాలికాధరులు. విభూతి సేవితులు. త్రిశూలహస్తులు. త్రినేత్రులు. గజచర్మధరులు. అందరు శివరూపులే. వారిమధ్య నా హరి, విరించి, హరి హయాదిమూర్తుల కాదిమూర్తి యగు నా మహానటుఁడు నాట్యము చేయుచున్నాఁడు. విష్ణుమూర్తి వేణువు నూదుచు న్నాడు. సరస్వతి వీణె మీటుచున్నది. లక్ష్మి తాళము వేయుచున్నది. బ్రహ్మ మద్దెలవాయించుచున్నాడు. పార్వతి ప్రక్కగా నిలుచున్నది. ఆ పైపై కేలూనుచు మహానటుఁడు నాట్యము సేయుచున్నాడు. అందఱును జేయుచున్నారు. ప్రమధులు, మనవారును. నేను తత్తరమందుచి త్తముతో భయభ్రాంతుఁడనై, నొక శిల మాటుననుండి చూచుచుం

టిని. అంతట మనవారైదుగురును విమానముల నవరోహించిరి. నాకాశమార్గము ననుగమించిరి. రాకుమారీ కైలాస ప్రయాణవార్త తెలుపుటకు నేను మిగిలితిని. ఆభాగ్యము నాకు లేదు. అదృష్ట విహీనుఁడను.

---

## 11. వీరభద్రారెడ్డి, విమర్శన

ఎసరులు గుమ్ములై ప్రతిరాయి, చెట్టు, పుట్ట వెదకుచున్నారు. రామామణి యెక్కడ ననుచున్నారు? పరిశీలించుచున్నారు. వారికి జాడ గాన్పించుటలేదు. రావణుఁడు గొంపోవ నీ ప్రాంతముల వెదుకనేల యని యొకఁడనుచున్నాడు. ఈ ప్రాంతములయందు దాచరాదో వెదకుట మంచిదిగదా యని యొకఁడు వచించుచున్నాడు. ఆకాశమార్గమున గొంపోయిన వాఁడేలోకమున నుంచెనో ఏలీల నాపె నవలోకించుట యని చింతిల్లుచున్నారు. మనకీచర్చ యేల? మన విధ్యుక్తధర్మమును నెరవేర్చుకొన వలయునుగదా! స్వామికార్యమప్రమత్తులమై యొనర్పవలయును. మనకీవిమర్శయేల యని యొకరనుచున్నారు. గుహాలు, చరియలు, కాలువలు, డొంకలు పొదలు వెదకుచున్నారు.

పల్నాటి తాలూకాలోని ఎత్తిపోతల ప్రాంతముల నుండి కృష్ణానదీతీరము వరకు వ్యాపించియున్న యీ కొండలోయలలో కృపాణపాణులగు రాణువ, రామసైన్యమువలె

గాలించి చూచుచున్నారు. ప్రతియడుగు విడువఁబడకుండ చూడబడుచున్నది. గుహలు గాంచిరి. లతానికుంజములు వీక్షించిరి. బొరియలు పొడిచిరి. చరియలు చొచ్చిరి. గుబురులు గాలించిరి. పొదలు వెదకిరి. వాగు లవలోకించిరి. అవి యివి యన నేల? దృగ్గోచరమగు నాయచలమంతయును వెదకుచున్నారు. శృంగములయందును జూచుచున్నారు. ఎవరును గానిపించుట లేదు. జను లలసిపోవుచున్నారు, కొండపని నుండు పనినిండినది.

"ఈశ్వరుఁడు కైలాసమునకుఁ గొంపోయిన నేరీతి ధరాధరమ్మున నావారిజాక్షిని వీక్షింపఁగలము. కొండిలోఁ జంద్రధరుమందిరాంగణమున కేగుచందంబులు నిజంబులా? అయిన నొకపరి మైదారుగురు పోపగలరా ? విశ్వసింపదగిన విషయమా? ఏదియో మాయగా నున్నయది. మించు బోడిని పెంచు లేమయిన వంచన జేయఁ గొంపోయియుందురా? చిన్నపురెడ్డి గన్నులారఁ గాంచితి ననుచున్నాడు. ఇతని వార్తలు విశ్వాసహీనములు గావా ? ఇతఁడేల నితరులలోనివాఁడు కాఁడు? నమ్మినబంటు గాకున్న గొండవీటి మన్నెదొర లెందుకుఁ బంపెదరు. రాజే వాజి సైన్యరాజికి రాజుగాఁ బంపెనుగదా!

అతని వాక్యము లయ్యవి. ఔషధములయందు మహిమలు గలదఁట. వారే ప్రాంతమందుండగనో యీతని కేవేవో కాలికి దగిలిన వారారీతి వీనికిఁ గానిపింప వచ్చి వచించెనా? వాని ప్రసంగము లన్నియు నారీతినే యుండునుగాని యీ యమానుషకృత్య మొక్కటే జూడ నగునా? ఇతఁడొక వేళ

పరకార్యతత్పరుఁడై రాజధానీనగరమున జేరి వారినాశ్రయించి వంచింప నిటకు వచ్చియుండునా? ఈరెడ్డిస్వామియు నాతని శిష్యులును సేవనిచేనయిన బంపబడి యుండటొక్కటై యే యకార్యమైనను గావించియుందురా? అంద ఱొకకోటలోని వారేనా? సఫలులయిరా? ఇట్లూహించుటకు మాత్ర మవ కాశమేది? ఇతఁడొక్కఁడే యితరుల యందు లాలూచిగ్రాయ యీప్రాంతమున నున్న మనవారిని దైవవశమున నిటకువచ్చి యున్న వంచులకు వంచించి పట్టియిచ్చునా! సర్వసంగ పరిత్యాగులను సంగ్రహించుకొని పోయిన సాంద్రారణ్య నివాసులకు సాఫల్య మేమున్నది. ఈ కాంతవస్త్రనైనా న్నమూ ల్యాభరణములు లేవే. ఏమో? ఉమానాథుఁడు వారికిఁ గైలాసవాస మొసంగియుండునా? అంతరంగ మంగీకరించుట లేదు. ఏదియో కృత్రిమమున్నది. ఇంతవర కెంతటి నమ్మ కమున నున్నాము చిన్నపురెడ్డి? విశ్వాసపాత్రుఁడు గాఁడా? మన కేమి" యని పలువురు పలువిధములుగాఁ జెప్పుకొను చున్నారు.

కొండలు కొండలక్రిందుగా నీటిజాలున నటనట పరి శీలించుచున్నారు. వీరభద్రారెడ్డి, నాగిరెడ్డి, గోపనామా త్యుఁడు నున్నారు. ఇరువదిమంది భటులున్నారు. అచ్చట చ్చటఁ జేరుకొను మట్టిపైనున్న పాదచ్ఛాయల గాంచుచు న్నారు. అవిపోయిన బాటను పోవుచున్నారు.

వీరభద్రారెడ్డి॥ చిన్నపురెడ్డీ! ప్రథమగణ మీ ప్రాంతమును ద్రొక్కియుండవచ్చును. పాదచ్ఛాయలున్నవి.

చిన్నపురెడ్డి॥ ఔను. వందలకొలది ప్రజలందుఁ దిరి

గిరి. వారివే గావచ్చును ?

పి॥ వీ॥ నీ యనుచరులప్పు డెచ్చట చరించుచున్నారు?

చి॥ రె॥ ఏకోనాంపేట. నాగళ్ల ప్రాంతములయందున్నారు. ఆటవికుల యనుమానము దగులుటచే యటకంపితిని.

పి॥ వీ॥ అయిన నీవెంట నొక యనుచరుఁడైన లేడా ?

చి॥ రె॥ నాకు సహాయమవుసరముగాఁ గాన్పించలేదు.

పి॥ వీ॥ రాకుమారిగారితో యెందఱున్నారు?

చి॥ రె॥ రాకుమారిగారును, రెడ్డిస్వాములవారును, నాగదేవరాయ్యలును, సూరపరాజుగారును, శారదయును మాత్రమే.

పి॥ వీ॥ ఆటవికు లుందు రేమోనని యైన సహాయము గొనలేదా ?

చి॥ రె॥ రెడ్డిస్వామివారిని యాదరింప వలసియుండె. వారెవరి సహాయమక్కఱలేదన్నారు. నన్నును నాకార్యముపై పొమ్మనిరి. కాని నేనే వెంటనంటి యుంటిని. ధన్యుఁడనైతిని.

పి॥ వీ॥ జాగరూకతతోఁ దగు పరివారముతో నుండ మన లేదా ?

చి॥ రె॥ సకలలోక సంహారకర్తకు, సాక్షాచ్ఛంకరులగుఁ జాలినవాఁడెవఁడు? వానిని దర్శించిన వెంటనే కండ్లు భ్రమఁగొని కాన్పింపనివయ్యెను. ప్రమోదమున మైమఱచితిని. అనంతరము దెలిచితిని. వినువీధిని జనుట జూచితిని. విచిత్రము.

పి॥ వీ॥ లోకము నమ్మవలదా ?

చి॥ రె॥ లోకములో నేమి ? మన విధ్యుక్తము నేఁగదా నెఱవేర్చుట ముఖ్యము.

పి॥ పీ॥ నాయాజ్ఞనుఁ దృణీకరించితివిగదా. భటుల నొక్కనినైన నీవెంట నేలయుంచలేదు?

చి॥ రె॥ స్వాములవారి యాజ్ఞల, రాకుమారిగారి యుత్తరువుల మీఁగే మన్నించుచున్న మాబోంట్లు సేవకులెట్లు చేయకుందురు. యేదియో కృత్రిమము జరిగినదని మీారను మానించుటేల ? యెంతవెదకిన నెట గాన్పింపగలరు. పకు లైన వెదకుట యవసరమైన కైలాస మెట్లరుగఁగలరు?

పి॥ పీ॥ నిజముగా నీలకంఠుఁ డేనీల వేణిని గొంపోయెనా?

చి॥ రె॥ కన్నార గాంచితిగదా?

పి॥ పీ॥ ఒకవేళ కోతుల కృత్రిమ ప్రయోగముచే వారినే కైలాసవాసులుగా భ్రమించి, తలంచి, తలవంచి, చేతులజోడించి, వారియకార్యమునుగాంచి సుకార్యముగాఁ దలంచి యూరకుండి, యిక నాభ్రమచేత నేమన్నావేమో? యెట్లు వచింపగలవు ?

చి॥ రె॥ అట్టి చెడ్డకార్యములుండునా? ఈవింత కనివిని యెఱుంగమే ?

పి॥ పీ॥ ఇంతమంది బొందితో వెండికొండ కేగుటయో?

చి॥ రె॥ నేను కన్నార గాంచితిగదా?

పి॥ పీ॥ అదియేలన భ్రమకారాదు. ఏ లతామహిమయో ? పకులమాయా ప్రయోగమో ? లేక నీ కృత్రిమమో ? అని వినువా రూహించుట కవకాశము గలుగుట లేదా ? మనము యత్నించి, మన పొరపాటు లేదని నిరూ

పించు కొనవలదా ? ఒకవేళఁ బరులకుఁ జిక్కిన చో ? తప్పించుకొని రక్షింపబడి వీక్షింప బడినచో ? మనము పరులతోఁ గలసి కుట్ర బన్నితిమని బయలుపడదా ! అప్పటి మన స్థితి గతు లేమగును ? చక్రవర్తి కెంతటి యకార్య మొనరించినవార మగుదుము. ఇందేదో మోసము గలదనియే నా విశ్వాసము. ఇంకను నీవు భ్రమయందున్నావు.

చి॥ రె॥ ఒకవేళ పరులు నాయంతవానికి మైకము గల్గించి యింద్రజాలముఁ జూపించి మనవారిని జెఱబెట్టి గొంపోవ శక్తి గలిగి యున్నచో నిక మనవారు మనకు జిక్కరనియే తలంపవలయును. కాన వెదకుట నిరర్థకము. నేను భ్రమపడితినా? కోయలయం దంతటి శక్తి గలదా? నేను కన్నులార గాంచితిని. వినువీధిని వేలకువేలు విమానములు విహరించుటను వీక్షించితిని. పార్వతీ పరమేశ్వరుల నుపలక్షించితిని. చంద్రకుమారీమణిని మేనకాకుమారి కేలూతనొసఁగి తనవిమానముపైకిఁ దీసుకొనుటఁ గాంచితిని. మిగిలినవారిని నితర విమానముల నెక్కించిరి. కొంపోయిరి. ఇంతకన్న జరిగిన దేమియు లేదు. విశ్వసింపకుండుటయు నీ వెదకుట వృథాయగు.

పి॥ వీ॥ అంతటి విచిత్రప్రదర్శనమైనచో, నత్తిపోతల ప్రాంతముల యందున్నవారికి నా దృశ్యము గాన్పించకుండునా! ఏదియో గోలజరిగినట్లున్న, సందడియైనట్లున్న నిన్ను వారడిగి వారితో నేమియు లేదు లేదనుచు వారలకు నీకథయే వచించి యనంతరా మూలనాదృశ్యమును గాంచనరుగువారిని నాపి వెనుకకు మఱలించినదేల? వారు కృష్ణా

నదీప్రాంతములవరకేగి పరిశీలించి వచ్చెదమని వచింప వారిని బల్కించి పురోన్ముఖులగాఁ జేసినదేల?

చి॥ రె॥ నేను కన్నారఁగాంచితిగాన వారు చూచుట యనవసరమంటి.

పి॥ వీ॥ నీవిషయమును ఛత్రపతిరాజా యనవేమారెడ్డి గారితోఁ జెప్పుకొనవలసి యుండును.

చి॥ రె॥ అయిన నేనువిశ్వాసద్రోహినని యీ మీతలంపు?

పి॥ వీ॥ ఆకాశ సంచారులకుఁ బాదములు నేలకుఁ దగులునా? ఇట కొండటి పాదచిహ్నములు గాన్పించు చున్నవి. ఈవిషయములన్నియు వ్రాసి, నిన్ను ప్రభువులకడకు బంపెదను. వారితో నీవిషయమువచించుము. అభియోగము. నీపైననే నిలచియున్నది.

చి॥ రె॥ నిందితులరీతిగా నే నంపఁబడియెదనా?

పి॥ వీ॥ ఔను రాజభక్తి పరుండవు. నీకగు యవ మాన మేమిగలదు?

చి॥ రె॥ యోచించుచున్నాఁడు. గ్రుడ్లెఱ్ఱఁబడినవి. కొండవీటికి గట్టిబంపెదవా యని యనుచున్నాఁడు. అట్టి పౌరుషశాలివా యనుచున్నాడు. వీరరసమూర్తి యగు చున్నాడు. వీరభద్రారెడ్డి కత్తి క్రిందనుంచమనుచున్నాడు. భటులకు సైగసేయుచున్నాఁడు. కత్తులుదూసిరి. చటపట.



## 12 నాగదేవరార్య లేఖ

బంధించికొని పోవువారి ప్రసంగము లాలకించినట్లు లేఖించుచున్నాను. సందర్భా సందర్భముల సవరించుకొను నది........................కాకతీయ సామ్రాజ్యస్థాపనా చార్యులని పలుబిరుదులందిన బిరుసుమగలు రాచకొండ వారు. ఉత్తరదేశమునుండి పరిదలవలెవచ్చి పడుచున్న నా తురకవరదల కానకట్టలై చెక్కుచెదరక నిలచి ప్రఖ్యాతిగాంచినవారిలా రాచకొండవారు.

ఏకశిలానగర రాజ్యము భిన్నమయినపిదప ధనాగార రక్షకులగు హరప్ప, బుక్కప్పలుపోయి యానెగొందియందు నిలచి దక్షిణరాజ్యమును నేలకొల్పిరి. నర్మాబాంధ......
.............సేనానాయకులలో నొకడును, దక్షిణదేశ సామంతుడగు నల్లారెడ్డి యద్దంకియందు స్వతంత్రించి యున్నాడు.....................ఎచ్చటప్రభువు లచ్చట స్వతంత్రులై మెలంగుచున్నారు.

.. ................ప్రధాననాయకుడు తద్రాజ్య రక్షకబిరుదాంకితుడు శతినాయుడు రాచకొండయందుండిన గోలకొండ తురకవరూథనుల నాపుట కవకాశముండుననియు నటనిలచి యాంధ్రరాజ్యమును రక్షింపనమకట్టె.........
చిన్నవారల.........సామదాన............పాయంబుల స్వాధీనపరచుకొనుచున్నాడు. ప్రభు............న్నాడు. నల్లగొండ, మెదకు, ధర్మపరము, చందా, పాకాల, ఓరుగల్లు, మానుకోట, కమ్రమెట్టు, భద్రాదిద్రి, దేవరకొండ, అలమూరు, భువనగిరిప్రాంతములన్నియు జయింపబడి వారి స్వాధీనమం

దున్నవి. ఆంధ్రదేశాభిమానముచేతనే రాచకొండవారు చరించుచున్నారట.

రెడ్డిప్రభువులట ప్రారంభమందుననే యోగీంద్రుడు మహనీయుని, వైశ్యుని వంచించి, పరుసవేది సంపాదించిరి. వారిమూలమున నతడు మున్మండ మంటలో దూకుటయు, దయ్యమైపట్టుటయు జరిగినది. ఆకారణంబుననే వారి కుటుంబముల కా వేమన ఇలవేల్పుగా నుండుటయు, వారి నామములముందు వేమనయను నామముండుటయు, నతనిని సేవేట కొలుచుటయు............ఆ వేమన కోమటి శివభక్తుడైనందున వారు తమ పిత్రాచారమును నగు వైష్ణవమతమును మానుకొని శైవులగుటయు, శైవులును, స్మార్తులగు బ్రాహ్మణు లందఱకు నగ్రహారంబు లొసంగుచు, దానకర్తలని పేరును సంపాదించుచు, లోకులను దమవైపునకు ద్రిప్పుకొనుచు, జిన్నచిన్న భూస్వాములను, ప్రభువులను స్వాధీనపఱచుకొనుచు, దైవానుగ్రహముచేత జగన్నాథము నుండి తిరుపతివఱకు నుండు ధరణిని, మలలకు తూర్పుగా నుండు శ్రీకాకులము, జయపురము, సింహాచలము, పీఠికాపురము, రాజమహేంద్రపురము, వేంగి, చిగురుకోట, దేవరకోట, కొండపల్లి, కొండవీడు, పల్నాడు, వెల్నాడు, పాకనాడు, కంభం, ఉదయగిరి, సింహపురి, కాళహస్తి, తిరుపతి సీమలను స్వాధీనపఱచుకొనిరి.............ఇట్లు క్రమక్రమ పరాక్రమములచే నభివృద్ధినందు, నీరెడ్డిరాజుల జయించుట రేచర్లవారికి గష్టముగానే యున్నది. ఇది జయించినగాని పూర్వాంధ్రమును జయించినవారుగారు. కాకతీయాంధ్ర

సామ్రాజ్యస్థాపకులని బిరుదున్న ప్రయోజనము కలుగదు.

తెలుగుదేశమంతయును మూడు భాగములక్రింద నున్నది. రాచకొండ, కొండవీడు, యానెగొంది యనునవి. గోలకొండ ప్రాంతమున కొంతభాగమే తురకల కరములం దున్నది............గోలకొండ, బీజపురాధిపతులగు చంద్ర ధ్వజులతో నిరంతరము జరుగుచున్న సంగరములచేతగాని, లేనిచో నీ రెడ్డిరాజుల నోఢ్రరాజుల జయించుట యెంతపని. వా రిప్పుడు కొండవీడును జయింపవలయునని తలంచు చున్నారు తగు ప్రయత్నమునగాని చరించుటకు వీలులేదు. వేమునయోగీంద్రుని నామము దశదిశలయందు వ్యాపించి యున్నది. మన ప్రాంతములయందు దేవరెడ్డి యౌషధముల యందు, రాజకీయములయందును, యూ కార్యములయందు, వేదాంతవాక్యములయందు, ఔషధమహిమలచేత, నింద్రజా లాదులచే ప్రఖ్యాతి నందియున్నాడట.

ఆయన యనుచరు లయిదారుగు రున్నారట. రెడ్డి స్వామి యనునాత డా దేవరెడ్డియే యని విశ్వాసము. మాచర్లలో నలువు రాయన శిష్యు లున్నారు. కొండవీటను నలుగురున్నారు. ఆయన శిష్యులందఱు మున్ముందర గోట్టున బెట్టవలయును. నీవును గొండవీడు వెళ్ళవలయును. వీరు వేమనయోగి శిష్యులమని యట నిలువనున్నారు.

............ఈ క్రిందిరీతి ప్రబోధింపబడి కోటినా యకుడు చిన్నపురెడ్డిపేరుతో గొండవీట నున్నాడట. బేత వోలు నేత రామానాయకుడు నామముననే చిన్నపురెడ్డి యశ్వముపెంటు గాసావాని వేసమున రాజధాని సొచ్చి

నది. నిండినది. మునుగనున్నది. నేను బంధింపబడియేయుంటిని. ముతరాచులు నీటిలో దుమికి ప్రాణములపై దీపినే నొడ్డున కీడుకొని పోయిరి. అందొకరు మొసలి కెరయయ్యెను. నీరముల వడికిన నాపుట్టి మునుంగుచు మునుంగుచు గొట్టుకొనిపోవుచు రాళ్ళమధ్య నిరుకుకొని పోయెను. నాపుట్టి మునుగలేదు.

బాగుగ తెల్లవారినది. దక్షిణతీరము మూడు బారలలో గలదు. ఆ ప్రాంత పౌరుఁ డొకఁడేటికి వచ్చిన, వానిని బిలచితిని. వాఁడరుదెంచి యీదుకొనివచ్చి బంధింపఁబడి యున్న నన్ను విప్పి యొడ్డునకుం జేర్చెను.

ఇదివరలో వ్రాసిన విషయము లన్నియుఁ బల్లెకారులచే వినియున్నాను. బేతవ్రోలే రాకుమారిని జేర్పనుండు తావు. అట నా మిత్రులు గలరు. నాకు సహాయముగా ధూళిపాళ అమరేశ్వర శాస్త్రిని, గండూరు ఎదిరి శాస్త్రిగారిని బంపవలసినది. ఇట్లు మల్లాది నాగదేవరార్యులు—అను యుత్తరమును చిన వీరభద్రారెడ్డి చదువుకున్నాడు. భయవిభ్రమాశ్చర్య సంతోషములచే ముఖకాంతులు మార, నాతురమున నుత్తరముల వ్రాయుచు నందలి విషయముల నవగాహన జేసుకొనుచు; అమరేశ్వర యెదురు శాస్త్రిగార్లకై కబురంపి యెదురు చూచుచున్నారు.

---

# 13. బ్రాహ్మణుడు, పయనము.

సీ॥ నెగసిన కొనలేచి నిలిగి యంతంతకు
నవుల ద్రోవఁగఁ దనరాకు దాని
జాగిన శాఖ లాశాచక్రముల కొలం
దులఁ బారవెట్టఁగఁ బొలుచు దాని
గనటు లొండొంటితోఁ గదియుచు నెడములు
ద్రింగి ప్రబ్బఁగ సొంపు మిగులు దాని
లోని జొంపము పవలును బెనుచీకటి
నొదలించి పొదలంగ నొప్పుదాని
గనియెఁ బవమాన వివిధ వర్తనకళాను
వర్తిఁ గాకఘూకారవస్ఫూర్తి జాత
భీతి పరిసరవర్తి నాభీలభుజఁగ
చండమూర్తి శమీతరుచక్రవర్తి.

అని కవిబ్రహ్మ తిక్కనసోమయాజిగారు వర్ణించినట్టి మహీరుహమా పాండవ ధనుర్బాణ ధర ధరాధరమును బుర డించుచున్నయది. ఈప్రాంతము శ్మశానమున లెనున్నది. ఏ యూరు సమీపమునకుఁ జేరితినో! దీని నధిరోహించి పలి కెదనని తలంచుచు నొక భూసురుఁడు కృష్ణానది యుత్తరతట మున చీకటియందున్న నొకచెట్టెక్కి కొట్టకొనకుఁబోయి నలుప్రక్కలు గనుచుండెను.

అతఁడు లావుగానుండును గాని బలిష్ఠుఁడు. పొడిగుండు. గుండ్రని ముఖము. దబ్బపండువంటి చాయ నలుబదిసంవత్స రములుండును. కార్యాతురునివలెఁ గాన్పించును. దారి తప్పియుండనగు. ఈశాన్యభాగముఁ జూచినాఁడు. నూడ్క

కుబేరులు, మహారాజులు, సంగ్రామార్జునులు, శిబి, కర్ణ, దధీచులు, రక్షించండి బాబాయని కరములు జోడించుచున్నాడు.

అప్పుడే తెరజారిబడిన నొక బండియందున్న నిరువురు యువతుల నుపలక్షించినాడు. అమ్మలారా! తల్లులారా! మీకు శుభమగుగాక. కోరికలీడేరుగాక. పురుషులకన్న గడితలే కరుణామయులు. కానంతఁ దినుటకుఁబెట్టిన మీనామ స్మరణ జేసుకొందును. రాజ్యలక్ష్ములు, మహారాణులు, దాతలని యనుచుండ నందొక కాషాయాంబరధారివచ్చి యా బండి తెరను మూసివేసెను. "ఆడంగులతో నీకేమిపని. రాణి వాసమువారని సివెఱుంగవా? ఎవఁడవు నీవు? ఇటనుండి పొమ్మ"ని గద్దించెను.

బ్రాహ్మణుడు: అయ్యా! మాది దేవరకొండ. అట కాటకముచేత మహారాజులను శ్రీశ్రీరాజాధిరాజమహారాజ రవితేజ సంగ్రామ ధనుంజయులగు శ్రీశ్రీ బేతవోలు రామానాయుఁడు మహారాజులుంగారిని ఆశ్రయించి, అడుగడుగు దండములు బెట్టుచు వారిదయ నాశ్రయించియున్న శ్రీమాది రాజు పోతరాజుగారి యండజేరి, వారు నందిగామ యందున్న తిన జిరాయితీభూములను దానముగానొసంగ బ్రతుకుచున్న గబ్బిట సుబ్బావధానిగారితో సంబంధము చేసుకొని, వారిని గనిపెట్టుకొని యాయాజోట్ల యాయవారములు చేసుకొనుచు భగవంతుని దయ యున్నంతవరకు తిని తిరుగుచు గాలక్షేపము చేయుచున్న చివుకుల చినవెంకటరామాంజనేయశాస్త్రిగారిని.

దేవరకొండలో మా మేనమామలు చెంజర్లవా

రున్నారు. చినరామానాథరంగనాథావధానులుగారికి తమ నాల్గవభార్య అయిన పదహారేండ్ల చిన వెంకటసుబ్బారామాంబ సోమిదేవమ్మగారికి తన యెనుబదియెనిమిదవ యేట కల్గిన చిన్నారిపొన్నారిచిరిపాప కాబొయ్యే నాప్రథమభార్య నాపసాని బాలాత్రిపురసుందరీ, లోకానందకరీ, భయాపహారీ, కామానందహారీ, రత్నదేవిగారి అన్నప్రాశన మహోత్సవమునకు వెళ్లి వారిని మెప్పించి ఏలాగైతేనేమి వారిచేత బతికి బట్టగట్టితే రజస్వల గాకుండా నుంటే యీలోపున నేను బ్రతికియుంటే, లగ్నానికి సందుకొని రాగలిగితే వచ్చేటప్పుడు 30తులాలపసిడి రాళ్ళు బిగించిన రాగి చంద్రవంకతో సహా, కార్యానికి కావలసిన నితర వస్తువులతో సహా ధనమిచ్చినచో, యీలోపల నాముద్దుల, కాబొయ్యేదానికి రజస్వలయగునని కాని, నింక యవాంతరము చేతగాని పెండ్లి జేయుకుంటా యుంటు నాకిచ్చి పెండ్లిచేసే గట్టిమాట చేయించుకొని, కాబొయ్యే అత్తవారిల్లు గాన, జొన్నకంకులు, మొక్కజొన్నకండెలు, సతుపిండి మొదలగు పంటవంటలు దినుచుండగా మారింటికి వస్తువుండి మాఅత్తగారి నవ్వులకానందించుచు, నవ్వుచు పేలుచు, మామామగారికన్న నెక్కుడు గౌరవమందుచు నీమాదిరిగా కాషాయబట్ట కట్టుకొని వారింటనే పట్టుమంచం, పరుపులపై కాలము పుచ్చుకొనుచు, నారాయణ నారాయణ యనుచు నుండే స్వాములవారి దయాప్రసాదములనంది యాస్వాములవారికి, మాకాబొయ్యే అత్తగారికి మంచములో మూడేళ్ళనుండి లేవలేకనుండే మామగారికి సేవచేయుచుండగా—

కాషాయాంబరధారి ॥ ఏమియీసోది. పో. చాలా ప్రొద్దుపోవుచున్నది. పొమ్మంటే. యీసోది చాల్చాలు.

బ్రాహ్మణుడు: మహాప్రభువులు. దయాపరులు. విశిష్టాచారులు. మాఅత్తగారింట్లో నుండే ఆ ఆనందస్వాముల వారివలె, కామానందస్వామివారివలె మంచివారివలె కాన్పించుచున్నారు. మీబోటివారితో చెప్పుకొనుటకన్న నింక మాకు రక్షకులెవ్వరు? మహాప్రభో? దీనుడను ! అనాథ రక్షకా! గజరాజవరదా! కైలాసాధిపా! గిరిజాపతీ! త్రిలోక నాయకా! నామొరాలకించు మహాప్రభూ ! అత్తవారింట నాలాగున గీతవలె మేయుచుండగా నిటనుండిన మాశాస్త్రి గారు సూరయమ్మగారియందు దున్న నభిమానముచేత, తన యింట్లో, మాయింట్లో కాలముగడుపుచూ, వంటజేయుచు, చాకిరి చేయుచుండుటచేత, మాయందు గలిగిన అభిమానము చేత మాతల్లిగారు మూలబడినందున తనకు వంట వండుటకు పక్కలు వేయుటకు, కాళ్ళుపిసుకుటకు యిబ్బందిగా నున్నందున త్వరగా నాపనుల లొనరించుటకు నన్ను తోలమని వెంటవెంటనే మనుష్యులపై మనుష్యులను బంపుటచేత, నేను వారు వెంటరాకుండా పైదేశానికి పోవుటవలన నేను వంటరిగా గంపెడు దిగులుతో, గంపెడు చీకటి నెత్తిన వేసుకొని నడచి నాలుగు రోజులు గుండె దడదడ కొట్టుకొనుచు వచ్చి మిమ్ము జేరితిని.

మహాప్రభూ! మీభార్యనుగాంచి గంపెడంతయాసతో వచ్చితిని బాబూ ! పొమ్మనినను, అదిలించినను ఎటకు పోయేది. దారేదో డొంకేదో దిక్కేది నాకు? రేచీకటి

కూడాను. నడవలేను నడవలేను. మెల్లగా ఇంగువ రామయ్యగారి యింట్లోకి అప్పుడప్పుడు వచ్చే కాసలపాటి దేవరెడ్డిగారినైనా ఆశ్రయించి అట కొన్నాళ్ళుండి పోతాను బాబూ! నన్ను చేతవ్రాలు చేర్చితిరా ! మహానుభావులు. వారింట నొకసారి కొడుకు పుట్టినపు డొక శాలువ నాకిచ్చినాడు. ఇంగువ రామయ్యగారి కిచ్చారాయన. అదే నాకిచ్చాడు. ఆమహానుభావుల చేరేదాక మీ వెంట నుంటాను. నన్ను కొట్టండి. తన్నండి. రక్కండి. చంపండి. బ్రాహ్మణ్ణి. బ్రహ్మహత్యాదోషం కట్టుకోండి. మానుకోండి. బాబూ పోలేను. రాలేను. జయ్ రామా, హరినారాయణ శివబ్రహ్మం. వేదాద్రినరసింహాది వెంకటేశ్వరా, గురులింగా!

ఇదిగో యింతమంది కోయవాళ్ళున్నారు. ఆబండీలో కట్టివేసిన అమ్మాయిగారు పిచ్చిపిల్లలాగా నున్నది. లేదా దయ్యంపట్టిన ట్లున్నది. పిచ్చియయిన నాకు మూలికలు తెలుసును. హనుమంత బీరకాయ కాదు. సరస్వతి ఆకుచూర్ణం, సముద్రపు పోసవిత్తులు, రవంత చిత్రమూలం, యిచ్చేది. దయ్యమైతేనా, నిమిషములో పోగొట్టనా? చేతవ్రాలు ఇంగువ రామయ్యగారు, అమ్మనమంచి పున్నయ్యగారు బాగా దయ్యాలు పోగొట్టుతారు. ఎంతటి కొండలంతటి దయ్యాలైనా ఎంతటి వీడులలోని దయ్యాలైనా వెంటబడి యెవరికి చేతకాకపోయినా పట్టుకపోతాను. పిల్లలను రక్షిస్తాను. ఒకచేయి చూడమంటారా? గనాత్కూరులో యిలాంటి దయ్యాలను బాగుచేసేవా డొకడున్నాడు. వాడికి మించిన వాడు లేడు. వాణ్ణి పిలిపించమంటారా ? నాచేతకాదా?

కొండపీటి జంగాన్నిదలచి జంగాలు చెప్పిన మంత్రం చదివి గోరెడు విభూతిపెట్టనా ? కట్లుగిట్లు దెగి దయ్యం ఎగిరి పోతుంది.

ఇతనిచాద ప్రసంగ మాకర్ణించిరి. చిట్టడవి. దారి నేరేలేదు. తెన్నులేదు. చాలా ప్రొద్దుపోయినది. ఇట్టివాఁ డున్న హాస్యముగాఁ గాలము గడుపవచ్చునని మతరాసులు, గాషాయాంబరధారి తలంచుచున్నారు. సోమిరెడ్డి, కానూ ష్ఠులు వల్లేనన్నారు.

---

## 14. రాచిలుక పోయినది

నిశియను నెఱజాణ నిజాకాశపుష్ప శయ్యాతలంబున బతివిరోగంబున విలపించుచు దొరలుటచేఁ దచ్ఛాయా పుష్పములు వాడి చెల్లాచెదరైనట్లు నక్షత్రములు వెలవెల బోవుచున్నయవి. ఆపె సవతులగు కల్హారములు విహీనానన నంబుల ముకుళించుచున్నయవి. పరమానందంబున జరియించుచు నలసి సొలసి నిదురమత్తుచేఁ దమ గూండ్లు చేరుచును జక్కవ పిట్టలు కూయుచున్నవి. పగటివేళ దమ్మవస్థలఁబెట్టు చున్న ఘూకంబులఁబట్టి భీకరంబుగఁ బగదీర్చుకొని యలసి సొలసి యని మెలకువఁ దెలసి తమ్ము నలయించునని, నిగ వులఁ జొరఁబడు ఘూకంబులు రావడిఁ జనుచున్నయవి. పూర్వదిశలు దెల్లపడుచున్నఁ బశ్చిమంబులకుం గాఱుచీకట్లు పరువెత్తుచున్నయవి. సునీలవర్ణంబులు నిజవర్ణంబుల లీనం

బుగా, నిగనిగలాడు నీరంబులు గలిసి సరోవరంబులు సైతి మెఱులాడుచున్నయవి. నిదుర మేల్కాంచి కలాకలారావములు సేయుచున్న, కలవరించుచుఁ గోలఁదిగా నెగురుచున్న పిట్టలఱెక్కలకుఁ గదలి గలకలమనుచున్న నాకులు గలిగి తరువరంబులు పరిఢవిల్లుచున్నయవి. ఱెప్పలు విప్పి పక్షింబులల్లార్చి తదితరములఁగూడి వినువీధిని బారులు దీరిచి పొడునరంబాదిగ శకుంతసంతానంబు లనంతాకాశంబున వంతులు వంతులుగాఁ బంతగించుచుఁ బగుంగిడుచున్నయవి.

పూర్వదిశ నరుణకాంతులు వరలుచున్నయవి. అవియే రక్తారవిందంబులవి విభ్రాంతిని మందళితంబులు నింగినిఁ బాఱుచున్నయవి. ఱెక్కలు నొప్పలు పుట్టఁగాఁ బరుగెత లేక వికసించిన పుష్పంబుల, లతానికుంజంబుల వ్రాలి సేదదీర్చుకొనుచున్నయవి. పుప్పొడుల రాల్చుచున్నయవి అరుణకాంతుల ప్రతిచ్ఛాయలచే నీరంబులు, నీరజంబులు వింత కాంతు లొనరించుచున్నయవి. అట్టిసమయమ్మున మహాకవి, మహామంత్రి, తిక్కనసోమయాజి వర్ణించినట్లు-

సీ॥ నీరజాకరములు నిష్ఠమైఁ జేసిన
భవ్యతపంబున ఫలమనంగ
దివసముఖాభినందిత చక్రయుగ్మకం
బుల యనురాగంపుఁ బ్రోవనంగ
హరిహరబ్రహ్మ మహానుభావంబు లొ
క్కటిగాఁగ గరగిన గుటికయనఁగ
సతుల వేదత్రయ లతికాచయము పెను
పొందఁబట్టెడు మూలకంద మనఁగ

నఖిల జగముల కెనెఱియగుచు జనస
మాజకరపుట హృదయ సరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె.

పొదలమాటునకుఁ గాంతి పొడిలెను. దినమున సంచ
రించు జీవరాసు లన్నియు మేల్కాంచి తమతమ కృత్యము
లలో మెలంగుచున్నయవి. జాము ప్రొద్దెక్కినది. కృష్ణానదీ
యుత్తర ప్రాంతమున జగ్గయ్యపేట, వాడపల్లియాల మధ్య
భాగంబున జిట్టడవి నట్టనడుమ గట్టియున్న గిత్తలు మేతకై
ప్రక్కకు లాగుచున్న జట్కాన కదలు బండిలోఁ బరుండిన
నొకరిత మేలు కాంచినది. ఒడలంతయుఁ బడలికగా నున్నం
దున విఱుచుకొనుచున్నయది. కండ్లు దుడుచుకొనుచున్నది.
పట్టపగలువలె నున్నదేయని చింతించినది. బండి దిగినది.
నలుప్రక్కల గలయఁజూచినది. ఆశ్చర్యం బడుచున్నది.
నిట్టూర్పు విడిచినది. ఇట్లనుచున్నది.

జాముప్రొద్దెక్కినది. నీరింకను లేవలేదు. ఆమధు
పానీయంబు ద్రావుటచేతనేనా ? ఔరా ! పాఱుడా ! ఎంతటి
వంచకుఁడవు. ధీరుఁడవు. ఛాందసుఁడవుగావు. వెఱ్ఱి
వాఁడవని తలంచి మేమే వెఱ్ఱివారల మైతిమి.
నీరందఱకు నీ వ్రెసంగినయాకు వేసిన నీరునుబోసితి.
సొంపుగా నున్నదని జుర్రినారు. మంచి నిదుర వచ్చినదని
పరుండినారు. అది విషమా! రుచిగా నుండినదని నేనును
బుచ్చుకొంటిని. అందుచేత నేనింతవరకును లేవనైతిని. ఇం
కను మత్తుగా నున్నయది. నీరందఱును బరలోకంబున కేగి

యుందురా ? నేను మేదినీసురుని మేలువచనంబులకు పూన
పోయితినిగదా! నీవే రాణివి యగుదువనియుఁ నీవే రాకు
మారివని చెప్పినవా చేతవాలునేత నిన్నే వివాహ మాడు
దువనియు, నీదినములు మంచివనియు వచింప నిజమంచు
నమ్మితి. ఈరాకుమారి నాకాటంకమనియు, నీపెను దొలగించి
యాస్థాన మాక్రమించిన సింహాసనమాక్రమించుకొనజాలుదు
ననియు, బేరాసపడితిని. ఎందులకై యీనాలుగుమాసంబుల
నుండియు, మొండివేసుకొని నేను శారదననియు, నాచెలికాడు
సామిరెడ్డి సూరపరాజని వేషముల ధరించి పలువిధ కష్టపరం
పరల సుఖతరంబుగ గడిపితిమో! యది యంతయునమ్మయ్యో.
బ్రాహ్మణుఁడు, రాకుమారియుఁ బారిపోయిరి. అటక్కరి
భూసురుని మోసమున జిక్కితి. భ్రాంతి పడితి. ఇంకవారు
చిక్కరు చేఁజిక్కినచిలుక జారిపోయినది. పాఱిపోయినది.

నాలుగు నెలలనుండియుఁ జేయుచున్న స్నేహము చేత
నామహాతల్లికి, యోగీశ్వరాణికి, నిరాడంబర సంచారిణికి,
అమాయికకు, సత్యసంధురాలికి, దీనజనరక్షణికి, చక్కని
చుక్కకు, మహాత్యాగినికి, వీరరసమూర్తినికి, దయాతరంగి
ణికి, మహాపవిత్రాత్మకుఁ గష్టములు పెట్ట మనసొప్పలేదు.
ఆజీవితమునకిక సుఖము లేదు. ఆకృత్యము తలంచుకొనిన
నాహృదయమునకు దిగులుకు పరితాపమునకుఁ బరిమితి లేదు.
అందుచే నాసులలితహృదయము కాలత్రాంగిని నగ్నితప్తం
గావించుటకు భయముగల్గినది. జాలికలిగినది. పోనిమ్ము.
ఒక మహాసియురాలి కాపద నూహించి యత్నానరింపక తప్పిం
చుకొంటి. కీడులో మేలు. కాని మాకు మున్ముందు రానున్న

యూపదలంగుడుచుట యెట్లు? నేనే రాకుమారినని యుందునా; వీరంగీకరించిన నొకయాటయాడుదురు. రాజుకట్టె నాయాట నిల్చుకాదా? ఏమి ముందు జరుగునో! కష్టేఫలీ. చూచెదను. ఆపాత్రుని యుపాయమే నిరపాయము. ప్రయోగింతు.

ఇంకను వీరెవరు లేవలేదు. మధుపానీయపు మత్తు చేతనేనా? మఱియొకటియా? అన్నట్లు జ్ఞప్తికి వచ్చుచున్న యది. వీరందరు పరుండినతరువాత సాధరణీసురుఁ డొక యూకుఁ దెచ్చి దానిని ఱంపిరి గానికి వాసనఁ జూపించెను. వాఁడు వాసనఁజూచి, స్వామీ! నిదుర వచ్చుచున్నది. పరుం డెదనని పరుండెను. ఆపడిన ప్రక్క ద్రిప్పినట్లు లేదు. ఇంక నట్లే యున్నాడు. మంచిది. ఆయవనీసురుఁ డనంతరము పరివారమునం దంతట గ్రుమ్మరినాడు. వంగినాడు. ఆకులను వారి నాఘ్రాణింపఁ జేసినాడేమో. కావచ్చు. చంద్రా స మయమగుటచేఁ గాన్పించలేదు. తదుపరి నాతో మాట లాడుచు, నవ్వులాడుచు, సరససమాడుచు, భావిమహారాణీ! చేతఃఫ్రాలు నేతామనోహారిణీ! అని యనుచు నన్నలరించుచు కౌగిలించుచు, చిత్ర చిత్రముగా ప్రసంగించుచు నా యూకును నాముక్కునకు నంటించిన గుర్తుగలదు. ఆయవనీ సురాలింగిత సుఖజనితానందమగ్నత మానసికనగుచున్నా నని సంతసించితినిగాని, యాకృత్రిమబ్రాహ్మణకృత మాయా ప్రతివిషప్రయోగమని యెఱుంగను. ఇప్పు డేమిచేయువల యును? వీరల మేల్కొల్పవలయును. అయ్యో! మారెండు గుఱ్ఱములు జలముగలవి. వేగవంతములు. బలిష్ఠములు. కానరావు. కావలివారల ఖడ్గములలో లెక్కకు రెండు

గానరావు. వారికి చిక్కవు. ఇప్పటికి మూడు యామములయినది. దక్కరు. ఇదిగో! ఈచీరె పారవేసి యున్నది. రాకుమారిదే ఈమూట విప్పఁబడి యున్నది. దేవరెడ్డి, సోమిరెడ్డి దుసులులేవు. తేలినది. తెలిసినది. వారిరువురుని జారు, అంగరఖా, సాగా కైజాముల వాజులతో నీనోజున నాలుయోజనములు పోయియుండ నగును. ఇక దొరకుట దుర్ఘటము. పోనిమ్ము. సురక్షితముగాఁ బోనిమ్ము. నేను పవిత్రురాలను రక్షించినందున కాదా మాధవుఁడు నన్ను రామానాయుని రాణిగాఁ జేసి రక్షింపఁడా? రక్షించినఁ జాలును. చాలును. కాలుని కోడను.

ఇట్లు చింతించి యాచంచలాక్షి నీరంబుల వారి వదనారవిందంబులఁ జల్లెను. కొంతవడికిఁ గాషాయాంబరధారియు, సోమిరెడ్డియు లేచిరి. ఇదియేమి? వీరంద అట్లున్నారని యడిగిరి. ఛాందసుఁడు బ్రాహ్మణుఁడు పత్రము సువాసనఁ జూపించుట మొదలుకొని తాను గంధ్లమూయుటవరకుఁగల విషయమే యెఱింగించినది. అనవసరముగా నడ్డమైన వానిని జేర్చుకొనుటచే నష్టము వచ్చినదని చురచుర నాలుగు నిష్ఠురదలమాటల వారిపైఁ బలికినది. నిశ్చేష్టులైరి. అందఱిపై జలముచల్లి మేలుకొలిపిరి. ఈవృత్తాంతమే వచించిరి. చేఁజిక్కిన చిలుక జారిపోయినది.

నలుప్రక్కల వెదకుదమని యనుచున్నారు. వడిగల గుఱ్ఱపు రౌతులు చిక్కరనుచున్నారు. అబ్బా! వీడెవఁడై యుండును. అమాయకుండని తలంచితిమి గదా! వచ్చిన వెంటనే వెడలగొట్టిన బాగుండెడిది. నేనప్పు డొక్క టేస్తా

సంటే, బోడాయన, బాపనోడు, బమ్మ అత్తె వత్తుందన్నాహ. లేకపోతే యమలోకానికి పాతకాపయ్యే వాఁడే. బాంబలంట గీంబలు ! మన పానాని కొచ్చిందా ! మాటలతో లాభ మేమి ? విచారించండి. వామాక్ష్మమ్మగారు చింపిరిగాఁడు క్రిందబడగానే కేక వెయ్యవలసింది. మాచి పత్రి అమ్మా యని నాకచ్చిన నేను వాసన జూచితిని. మైమఱచుచుంటిని. నోట మాటరాలేదు. ఆలాగా ! ఇదిగో ! ఈ ప్రాంతమందే యూయాకు పిప్పిగలదే. పారవేసినాడు. నిజముగా నింతమ హిమ యుండునా. సాధు మహారాజుగారూ ! మాబండోడికి వాసన జూపించండి. చూడరా ! ఏమో! సామీ! నేనుంటెసి గదా. సూసించండి. పీల్చరా బాగా ! అదిగో! తల తిప్పు చున్నది. తూలుతున్నాడు. నిదురవచ్చింది. అబ్బా ! ఎంత మహిమున్నది ! ఆకంటే ఆకుగాదే యిది! కాబట్టి యోగులు దీనిని సంపాదిస్తారు. ఇంకా కొన్ని ఆకులున్నవి. ఆనాసి వేరొకనిక కట్టితే వారుమన వెంట కుక్కలాగా వస్తారు. అది రాకుమారికి గట్టినట్లయితే యీ తిప్పలు లేకపోయేవి గదా. దొరక లేదు. ఈ బాపనాడి కీచోట ఈ ఆకెట్లో దొరి కింది. ఈ గ్రహచారం ఉండట్టు. సత్తెంగా అంతే.

ఈ ఆకువిషయ మెవరికి తెలియదు. నాకు, వేమనకు, రాకుమారికి దేవరార్యులకే. ఈబ్రాహ్మణుఁడు వేమన్నగాఁడు, నాగదేవరార్యులు గావచ్చు. అతఁడే. అతఁడు కృష్ణానది యందు గ్రుంకి కూలెనని పల్లెవారు దెలిపిరే ? బ్రతికేనేమో మనబ్రదుకుల మీఁదికి. సత్రములో రాళ్ళుకొట్టే వారికి జీవము మెండు. కట్టు బొట్టు జుట్టు అంతా మారినది. గుర్తించలేక

పోయినాము. జుట్టు గడ్డము తీసివేసిన నతఁడే యీతఁడు. అనుమానము లేదు. బేతవ్రోలు, మాచర్ల, దేవరకొండ యీ ప్రాంతము లంతయు విద్వత్సభలని చనుచుండువాఁడు. కాక తోరెవలన్నియు గ్రహించి యుండుట నాపెను దోడ్కొని రిప్పన మాచర్లకో, చింతపల్లికో చనియుండును. ఈ సమయమున కృష్ణదాటి వారి రాజ్యమందుండుదురు. ఒకవేళ కృష్ణ కీనల దరినున్నను మనకు దొరకరు. అతఁడు పారుఁడై నను, నాపె యబలయైనను నోక్కొక్కరు నూటికి సెలగ. ఆయన కారుల శిరముల నరుమాడుటలో నసమానుఁడు. ఈపెయునట్టిదే. అందులో వా రధిరోహించినవి దివ్యకాంభోజాశ్వములు. లేళ్ళు. చంద్రాస్తమయమయినపిదప వైశాఖశుద్ధ షష్ఠి, పదిరెండు గడియల క సమయము. నాలుగు జాములు. ఇప్పటికి కారు యోజనములు జనియుందురు.

ముందు మన కర్తవ్యమేమి ? ఊరక బేతవోలు చేరిన నా రాజూరక విడువడు. ఉత్తమాంగము లుత్తరించును. ఈ చావులుఁ దప్పించుకొనుట యెట్లు. అని యందరాలోచించుచున్నారు. వెలవు దొరకలేదు. చింతించుచున్నారు. గంపెడు దిగులుతో గుండెలు దడదడ మని గొట్టుకొను చున్నవి. అంతట వామాక్షి యిట్లనుచున్నది. నన్నే రాకుమారి యని యీరాజు కల్పింపుఁడు. నన్నిదివరలో నాతఁడు చూచి యెరుంగడు. రాకుమారిని జూడలేడు. ఈ వ్యవహారములలో నే నున్నానని యెరుంగడు. మహారాణియగు నా యాశ్రమమున నీకు మాత్రము దరుగేమి. మహారాజుల యాశ్రితులకన్న మహారాణుల యాశ్రితులకే ఫలితము మెండు. అందులకు

వారంద రానందమందిరి. ఇదియే మంచి మార్గమని సంతోషించిరి.

---

## 15. చింతపల్లి—రాకుమారి.

బొంబాయి రాజధానిలోఁ బశ్చిమ సముద్ర తీరస్థ సహ్యాద్రి శృంగముల జన్మించిన కృష్ణా మహానది ప్రఖ్యాత నదులగు భీమ, గుల్బర్గా, తుంగభద్రా నదులఁగూడి విశాలవంతమయి శ్రీశైల పర్వతముల మధ్యగా సూక్ష్మాకారమయి పాతాళమున కంటుచుఁ బాతాళగంగా నామమును ధరించి పాము మెలికలవలె పారుచు గుంటూరుజిల్లాకు నుత్తరముగాఁ బల్నాటిజుట్టి ప్రవహించి యనంతరము నందిగామ, సత్తెనపల్లి తాలూకాల మధ్యగాఁ బారుచుఁ జింతపల్లి, యిస్తేపల్లి గట్టులను దాటి క్రోశము విశాలమై, మైదానమున బ్రవహించుచు, ననేక లంకలుగల్గి, యమరావతి, గనాముకూరుల మధ్య రెండు క్రోశముల విరివియై విజయవాడ, సీతానగర పర్వతముల మధ్యగాఁ జరియించుచు ననేకముఖములుగా సముద్రమున సంగమించుచున్నయది. శ్రీశైలమునుండి చింతపల్లివరకీ నదిచుట్టు మధ్యగా చీలికగాఁ బాఱుచున్నది. కొయ్యపడవలిందు నడచుటకు వెనుకాదును. సాధారణముగా "పుట్లు" అనుపేరఁ బరగు వెదుళ్ళ గంపలు తోలుతో బాగుగా నీరంధ్రముగా గుట్టబడినవిగాని, చిన్నినావలుగాని సంచరించుటకు వీలగును. తోలుబుట్ట నీర

ముల మాటుననున్న కొండరాళ్ళకుఁ దగిలినను బగులనికారణమునఁ బుట్లనేవాడుదురు. ఈపుట్లపై నయిదార్గురు పయనింప నిర్భయముగా నుండును.

సాధారణముగా నీసహ్యాజ శ్రీశైల, చింతపల్లి మధ్య భాగంబున నూరుగజములనుండి మున్నూరుగజంబుల వెడల్పుగల్గి యలరారుచుండును. ఈమధ్యభాగంబున గొండరాళ్లు మెండుగా నిండియుండును. చింతపల్లినఱకట్లు నిండియుండుటచేతను, నావికానుకూలముగ నీదిగువయేటిలోనుండి యీయెగువయేటిలోనికిఁబోవనున్న నావలు, పుట్లు, పడవలీ చింతపల్లిసమీపముగానే సన్నగానున్న నొకమార్గమున బోవలసియుండుటచే నీచింతపల్లి యొక్క సహజప్రాముఖ్య స్థలంబుననుండుటచే దానివిఖ్యాతి ప్రబలియుండెను.

ఈచింతపల్లి పూర్వమునుండియుఁ బ్రఖ్యాతిగాంచియున్నది. అట బలిష్ఠమగు దుర్గమున్నది. వాసిరెడ్డివారికాలమునసేగాక కాకతీయులకాలమునను, వాసిగాంచియుండెను. ఇంతియగాదు. ధాన్యకటక సామ్రాజ్యము క్రీస్తుశకమునకు ముందునుండియు, మెండుపేరువహించినకాలమునుండి మూడవ శతాబ్దాంతమునఱకుఁ బరదేశవాసుల మన్ననలనందుచునున్నంతవఱకు నామహోన్నత దశాస్థితి నున్నకాలమున, ఇప్పటి గుంటూరుజిల్లాలోని ధరణికోట, యమరావతి యనునది, ధాన్యకటకమను నామముతో రాజధానీ నగరమై, సంపదలకాకరమై, రాజాస్థానమైనకాలమునుండియు నీరాజధానీ నగర రక్షణార్థమై, పరులదాడుల నరికట్టుటకై నా రాజుల

కాలమునుండియు, నీచింతపల్లిదుర్గ మపారసైన్యదుర్గమమై చరిత్రాత్మకమై విరాజిల్లుచుండెను.

నేఁడీ నగరము కొండవీటిప్రభువులగు శ్రీయన వేమారెడ్డి కుమార వేమారెడ్లప్రభుత్వమునుండి; బేతవోలు, రాచకొండ సీమలనుండివచ్చు పరరాజ్యాక్రమణాభిలాషములగు సైన్యతరంగములకుఁ జెలియలికట్టయై యలరారుచుండెను. నేఁటి వేయిమంది యుద్ధనావికాదళము. రెండువేల యాశ్వికసేన, నాల్గువేల కాల్బలము సిద్ధముగానుండును. ఇంతియగాదు. సుశిక్షితులగు వీరభటులు పనిలేని కాలంబున సమీపగ్రామములయందుండి కర్షకులై కాపురముసేయుచున్నారు. కాకిచేఁగ పురంపగా నీకర్షకులు కత్తికటారులంది దుర్గమును సమీపింతురు. రణభేరీమ్రోగిన జాముసేపటిలో మరి పదివేల బలగ మాయానాయకాది పదవుల నలరారు వీరపుంగవులతోసహా మొనలుగట్టి, రాజనీయసేనాని యాజ్ఞల శిరసావహింప సిద్ధముగానుండునన్న నాఁకాలమున మనదేశమున నెంతటిశూరులు పలువిధా యుద్ధహస్తులై చరియించుచుందురో యాలోచింపుడు! అట్టివారెవ్వఁడు ధైర్యవంతులైయుందురు. పొలములయందు జరించువారికిఁ బాములన్న భయములేదుగాని, యింటఁ గుర్చీదిగని వారికి దేలన్నభయమే. నిరంతర పరిశ్రమయుత కరవాలకలిత పురుషాళికే పరులన్న, జోరులన్న భయములేదు. పొన్నుకఱ్ఱఁ బట్టువానికే దొంగన్న భయమేగదా!

చింతపల్లికోట, యంతటి ప్రాముఖ్యస్థలంబున గట్టc బడిన దగుట నిట దూరదర్శినీయంత్రసహితచారులు, రాత్రిం బవళ్లు నలుదిశల గమనించుచు జాగరూకులై యుందురు.

వైశాఖ శుద్ధ సప్తమీ సాయంకాలము. నగర రక్షకులా నదీగర్భమునుండి వచ్చుచున్న తోలుపడవను గాంచుచున్నారు. చిన్నది, నలుగురునడుపువారు. లోన నిరువురున్నారు. రాళ్ళను దప్పించుకొనుచుc బ్రక్కనవచ్చు మొసళ్ళను శూలములతోc బొడుచుకొనుచుc బలుగండములcబడుచున్నారు. నదిమధ్యయందున్నారు. దక్షిణతీరమునకు రావలసిన పడవ నదీగర్భముననే పయనముc జేయుచు వచ్చుచున్నయది. తీరవాసుల యుపద్రవముగలుగకుండc బోవుటకైయుండునేమో. నదీగర్భము నెట్లుదాటగలరు? దుర్గమునకుc గొలcది దూరములో నదీతీరముననున్న పల్లెకాపు లాలోచించుచున్నారు. పాపము వారి హృదయములు ద్రవించుచున్నయవి. కరుణారస మందంతటికిc గలదు. పుట్టిని పల్లెకారులు దక్షిణతీరమునకుc జేర్ప నిష్టపడు ప్రయత్నించుచున్నారు. కాని నలుప్రక్కల రాళ్ళమధ్యనా పుట్టియున్నది. అట భయంకరములగు మకరములు, గజరాజమును బట్టి గజగజలాడించిన మకరములc గరముమీరు వారిచరములింకc గలవు. చూడcగా వారిపద్ద నొక తెడ్డేగలదు. రెండవది యొకపాటచక్క. ఇరువురు కత్తుల ధరించియున్నారు. మకరముల శిరముల నా కరవాలములకుc గురిసేయుటయే వారి పని. దానియం దిద్దఱున్నారు. నలుబది వత్సరములవాడు. మీసములులేనివాడు. దబ్బపండువంటివాcడు. ఇరువది వత్స

రములవాఁడు. చంద్రునిగంతు జయంతాదులమీరుసందంబు నాడున్నాఁడు. ఇరువురు శూరోచితవేషముననున్నారు.

దుర్గాధిపతి యాజ్ఞచేఁ జక్రముల యినుపపడవలు రెండు బిరబిర వచ్చినవి. వెంటనే వారం దధిరోహించిరి. పుట్టి కొట్టుకొని బోవనిచ్చి దానిపాటున కానందించుచున్నారు. ఈపడవలు తీరముఁ జేరినవి. దుర్గాధిపతి పరిశీలించిగాని ప్రయాణీకులఁ బోనీకుడని యధిపతియునుచున్నాడు. మీయిచ్చవచ్చినట్టు నడతుమని యా మీసములులేని సేనాని వేసగాఁడన్నాడు.

రెండవయతఁడేమో సంజ్ఞ చేసెను. పరిశీలకుఁ గడి గ్రహించి రజకులకై కబురంపి చేయవలసిన పను లాచరింపఁ జారులకుఁ జెప్పి తాను దుర్గమున కరిగెను. తీరముననాకళ్లు శిబిరమును నిర్మించిరి. చుట్టు తెరలు నిర్మింపఁబడినవి. దుర్గమునుండి పేటిక యొకటి శిబిరములోని కంపబడినది. ఇరువదేడుల శూరుఁ డాగుడారములోనికి జేరెను. అంత దుర్గాధిపతి నూరుగురాశ్వికులతో, భూసురులతో గుమిగూడి చనుదెంచు పౌరులతో గోముఖాది పలుముఖ వాయిద్యములతో మేనాపల్లకులతో నరుగుదెంచుచున్నారు.

భూసురాంగనలు, రెడ్డివనితలు, మంగళహారతులు దీసుకొని పాడుచున్నారు. చాకళ్ళు దుప్పటులఁ దోలఁగించిరి. దుర్గాధిపతి మొదటి శూరుని గౌరవించుచున్నాడు. ఇంతలో నిరువదిమూడు సంత్సరముల దివ్యసుందరి, పూర్ణచంద్రానన, మేఘముల మధ్యనుండి వెడలివచ్చు పూర్ణిమాచంద్రబింబమును బురడించుచు, సాక్షాల్లక్ష్మిబోలె, సువర్ణ

ఖచితవస్త్రాలంకారిణియై, రత్నఖచిత సువర్ణాలంకార శోభితయై అమందానందకలితముఖారవిందయై, ప్రఫుల్ల నీలాంబుజలోచనయై దర్శన మొసంగెను. జయ్ రాకుమారికి జయ్! జయ్ చంద్రకుమారికి జయ్! అని జయధ్వనులు మిన్నుముట్టెను.

---

## 16 బేతవోలు కబుర్లు

భగవంతుడు మనయందున్నాడు. మాచర్లనుండి బయలుదేరి భారద్వాజాశ్రమముం జేరి, నది దాటునప్పటికే రాకుమారిని విడిపించుకొని వచ్చు నాగదేవరార్యులను, వేటఁదిన్న యాడుపులివలెనున్న చంద్రకుమారిని దర్శింపుట మనకష్టములు దప్పిన వన్నమాట. ఏమందువు ధూళిపాళ అమరేశ్వర శాస్త్రీ?

అమ॥ అదిగాదోయి! ఎదురుశాస్త్రీ! మాకున్నది మన కష్టమంతయును. పప్పు దప్పళము లన్న మీగంధాగ వారికిఁ బరమసంతోషము. బేతవ్రోలులో మహోన్నతయని ప్రఖ్యాతిగాంచిన నీ యింగువ రామయ్యగారి యింటిలో సంతర్పణలను విడువ బుద్ధిరాక నిలచెద నంటున్నావే, ఏలాగు నాగదేవరార్యులుగారు చెప్పినట్లుగా రామానాయనిపై ఈరాజ్యమునందుననే ఆయనపైన వ్యతిరేకభావము వ్యాపించవలెను? చెప్పు?

ఎమ॥ రాకుమారీగారు మార్చి వాడమని యిచ్చిన యుంగరము, గాజులు, హారములు, ఇరువదివేల వరహాల

యినవా? దైవభక్తులకును మనము సర్వసంగపరిత్యాగు లయిన మనము పరులసొమ్ము తృణప్రాయముగ జూచు మనము ఈ కార్యము బాగుగ చేయుదుమనియేగదా యింత డబ్బు యిచ్చినది. దీనిని బ్రాహ్మణులకు, భట్టులకు పరిహాస్యముగ వెచ్చపెట్టితిమా? నిముషములో జనులకు రామానాయుని పై వ్యతిరేకభావము గలుగును. అందులో యీ పేటి నోలుసీమ, మున్నూరు వాడపల్లికొండలమధ్యనే గదా! చిన్న సీమ వారములోఁ జలలో వ్యాపించును. కీర్తి వ్యాపించుట కష్టముగాని, అపకీర్తి నిముషములో నల్లుకొనును. సైనికులు రాకుండ ముందు ప్రబోధము చేయవలయునని గదా? దుర్మార్గుండని వ్యాపింపఁ జేయవచ్చును. వారు సప్తమి సూర్యోదయమున కొన్నించిరి. ప్రసంగించితిమి. నేటికి దశమి. ఈలోపుననే బ్రాహ్మణులకు, భట్రాజుల కిచ్చిన ద్రవ్యమూలమున వారియందు వ్యాపింపఁజేసిన వారలవలన నలుప్రక్కల నల్లుకొనిననుట నిజము. మనకాపుడు నా మేనమామ కొడుకు లేడా? ధరణికోట. ఆశివరామయ్య తగువారలుఁ దిన శిష్యుల నలుభాగముల కంపెఁ గదా? కాల మనుకూలముగ నున్నయది. త్వరయేల?

అమ॥ ఇందు ఘోరాబద్ధములు కొన్ని గల్పింపవలసి వచ్చుచున్నవి. ఏలాగో తోచుటలేదు.

ఎదు॥ మనము చేయునది చాలా ఘనకార్యము.

గీ॥ వారిజాక్షులందు వైవాహికములందుఁ
ప్రాణవిత్తమాన భంగమందుఁ
జకితగోకులాగ్ర జన్మరక్షణమందుఁ

బొంకనచ్చు నఘము పొందదధిప॥

మన ప్రయత్నముచే రామానాయఁడు మడిసెనా! అతనికిఁ దగినసహాయమాతనికి దొరకనిచోఁ బోతన్నగారు చెప్పినట్లు లాభమే కల్గు. మనకా యఘము రాదు. నిశ్వాస ముంచుము.

అను॥ ఈ పాలేటి నీటియం దెంతటి మహాత్మ్యము గల దోయని భ్రాజులు విద్యార్థ్యముగాఁ జెప్పుకొనుచుందురే! నాకా ప్రాంతము క్రూరప్రదేశమని తలంతును. అబ్బా! ఎన్ని ఘోరయుద్ధము లాతావున జరిగియుండునోగదా! పాలకు రి ప్రాంతము లెట్టి సారవంతములోగదా.

ఎదు॥ అట్లు తలంచకుము. ప్రఖ్యాతినగరమిా జేత వ్రోలి పాలేటితీరమునగలదు. మహావీరభూమియును, మహా కవులఁ గన్నతల్లియునగు త్రిలింగదేశమని ప్రఖ్యాతిగాంచిన నా నేకశిలానగర రాజ్యభాగమును వర్ణింపఁ దరమా! ఇఁక చాలించుము. మహాజనము నేటిసంతర్పణకుఁ జనుదెంచెదరు. ఈసంతర్పణయినతరువాతనఁట యీా జేతవ్రోలు నేత వేదాద్రి వెళ్లునఁట. ఆజనబృందముమధ్య మనము మెల్లమెల్లగాఁ మనప్రచారముఁ గావింపవలయును, అని చెప్పుకొనుచు నిద్దరు భూసురులు జేతవ్రోలు పాలేటిరేవున స్నానముఁజేసి పురిలోని కరుగుచున్నారు.

పాలకు రియనుగ్రామము నైజామాంధ్రరాజ్యములో నున్నది. బ్రహ్మణ్యులగు బమ్మెర పోతరాజుగారి నివాసస్థల మగు నేకశిలానగరమను నామాంతరము విఖ్యాతముగాఁగలి గిన వోరుగల్లునకుఁ బశ్చిమమున గలదు. ఆప్రాంతముల

గురిసినవర్షమంతయుఁ బశ్చిమముగా సన్నని వాగుల మూలమునఁ బాఱి దక్షిణముఖముగాఁ బాలకుర్తి ప్రక్కగాఁ బెద్ద వాగుగాఁ బాఱఁ బ్రారంభించును, అటనుండియే దానిని బాలేరందురు. ఈ ప్రాంతమే! ఈ పాలేటి జన్మభూమియె! బమ్మెర పోతరాజు, పాలకుర్తి సోమనాథుఁడు, వల్లభామాత్యుఁడు, సింగన, పండితారాధ్యుడు, విద్యానాథుఁడు మొదలగు మహాకవులును, గణపతి, వీరరుద్రమ, ప్రతాపరుద్రుఁడు మొదలగు మహావీర చూడామణులును, జన్మించిన చరిత్రాత్మక స్థలంబు. అట్టి వీరవిజ్ఞాన ప్రదేశములనుండి పాఱుచున్న పాలేటి ప్రాముఖ్య మెంతయేని గలదు. దీని ప్రాంతమందెన్ని యుద్ధములు జరిగెనో వర్ణింప నెవరితరము. అందుఁ బాఱిన వీరరక్తరక్తిమచేతనే యీనీరము లెఱ్ఱనై, కృష్ణానదీద్వారమున సముద్రమునజేరి యాయపార సముద్రమున నరుణకాంతులచే నాక్రమించినదయ్యెను. ప్రతిదిన ముదయమా సముద్రమును గాంచిన గాన్పించునా యరుణకాంతులా యాంధ్ర వీరరక్తసిక్తారుణచ్ఛాయలేసుమీ.

పూర్వకాలమునుండియు నీరీతి నాంధ్రరక్తమా సంద్రంబునఁ సాంద్రంబుగఁ గలియుటచేతనే యాంధ్రులు పూర్వమునుండియుఁ బారావారములనిన భయమందక వానగులవలె నవలీలఁగ బర్మా, సయాం, సుమిత్రా, జావాది లంకలకు సముద్రముదాటి పోవుటయుఁ గొన్నికొన్ని రాజ్యముల స్వాధీనపఱచుకొనుటయు సంభవించినది. పూర్ణవర్మయను పుడమీశ్వరుని పాదచిహ్నముల జావాద్వీప పర్వతముపై నింకను జూడనగును. మనయాంధ్రులు పూర్వకాలమునుండియు,

కృష్ణానదీతీర శ్రీకాకుళమున క్రీస్తుముందు 400 యేండ్లప్పుడే ప్రథమాంధ్రరాజ్యమును స్థాపించినది మొదలు క్రీస్తుముందు 100 ఏండ్లనుండి క్రీస్తు మొదలు 300 యేండ్లవరకు ధాన్యకటక (అమరావతి) నగరమున శాలివాహనులను శాతవాహనరాజులు, గంగాకావేరీ ప్రాంతముల, జావా సుమిత్రాది ద్వీపముల ద్వితీయాంధ్రరాజ్యమును పాలించిన కాలమ్మునను, క్రీస్తుశక మేడువందలనుండి పదివందల యేబది వరకు దూర్పు చాళుక్యులేలూరు సమీపమున జినవేంగి, పెదవేంగియను చిఱుగ్రామ పరిసరముల వేంగియను మహానగరమునను, అనంతరము రాజమహేంద్రవరమునుండి పాలించిన తృతీయాంధ్రరాజ్య కాలమునను, రాజరాజనరేంద్రుని కుమారుఁడు కులోత్తుంగ చోడదేవుఁడు తంజావూరినందు నివసించి ద్రావిడాంధ్రములఁ బాలించుచు, గుంటూరుజిల్లా చందవ్రోలను దనదు పురనాయకులగుఁ జోడులకు రాజప్రతినిధిత్వ మొసంగ, వీరు పాలించు చతుర్థాంధ్ర రాజ్యపాలనమునను, పండితారాధ్య, విద్యానాథ, కుమారిలభట్టు, బమ్మెర పోతరాజాది మహాకవుల, గణపతి ప్రతాపరుద్రాది మహావీరులు, రుద్రమగణపాంబాది సోదరీమణులఁ గడుపారఁగాంచిన శ్రీ యేకశిలానగరమను నోరుగల్లు రాజధానిగాఁ గల్గి 1100 నుండి 1350 వరకు వరలిన కాకతీయ సామ్రాజ్యమను బంచమాంధ్ర రాజ్యకాలంబునను, బుక్కరాయలచే 1355 స్థాపింపఁబడి శ్రీకృష్ణదేవరాయలచే మహోన్నత దశ నొంది రామరాజు నిర్యాణానంతరము 1565 వరకు వరలిన షష్ఠాంధ్రరాజ్యకాలమున,

ఈ హూణరాజ్యములు ప్రఖ్యాతి నొందకలోపల నలరారిన కొండవీడు, రాచకొండల దండిమగలకాలంబున, ఆంధ్రులు బర్మా, జావాలతో వర్తకము గావించు కాలమున మన యాంధ్రదేశమున వర్తకవ్యాపారములచే వన్నెగాంచిన నగరము లెన్నియేని కలవు.

బర్మా, జావా, సుమిత్రాది ప్రాంతవర్తకులు కృష్ణానదీ ముఖద్వారమున నెగుమతికి బయనమై ప్రఖ్యాతి వహించిన కాకతీయసామ్రాజ్యములోను, ననంతరము వరలిన రాచకొండ రాజ్యములోను, వర్తకవ్యాపారములు జరుగుచుండును, పశ్చిమోత్తరాంధ్ర రాష్ట్రమునకుc బూర్వవర్తకద్వారమన ప్రఖ్యాతి గాంచిన చేతవ్రోలునగర మీ కాలంబు నందేగాక, బెజవాడ ద్వారిన యోమమార్గములు నేటికాలమున నిర్మింపcబడకున్నంతవరకు, జగ్గయ్యపేట యను పేరుతో మహానగరమై లక్ష్మీనిలయమై విలసిల్లిన నా బేతవ్రోలు నగరము చరిత్రాత్మకమై, రక్తవర్ణనీరములతోc గలసి పారిన వీరరక్తయుక్త పాలేటినదీతీరమున ప్రకాశించుచున్నయది. ఆనదీతీరములయందే ప్రాంతమును జూచినను మహావీరుల, నా లక్షణము గలిగి వర్తించువారలc గాంచగలవు. ఇప్పటికా పాలేటిప్రాంతము, వీరుల, సర్దారుల, జాగీర్దారుల గలిగి కృపాణులగు వీరోత్తంసులతో నిండియుండcగా, సంపూర్ణ స్వాతంత్ర్యతా మహిమచే సుయోగ్యులగు నా కాలమున నేరీతి విలసిల్లుచుండెడినో వర్ణింప నేరితరము. ఏభారతీయుcడైన నిప్పటికా ప్రాంతమున కేగిన మూర్తీభవించిన యాంధ్ర పౌరుషమును గాంచcగల్గును.

పరులై యుండురనుట నిజము. అధికారిచే మానహీనమందిన వారు బహిరంగముగాఁ గాకపోయిన గనుమాటునసైనా వారికి నష్టమాపాదించుటకు యత్నించుచుందు రనుట నిజము. రాజులు ధనకాంక్షులగుటచేత వర్తకులవలన ననేకరకములపన్నులు వసూలుచేయుటచే వర్తకులయిష్ట మందుచుందురు. రాజుచే నవమానింపబడినవాని చుట్టములజాతివా రందఱారాజును నసహ్యించుకొందురు. వారి నాశ్రయించువారిమూలమున, వారికూలివాండ్రమూలమున, వారిని గలియుచుండు ప్రతి వారిమూలమున నారాజుపై యపఖ్యాతి విరివిగా శీఘ్రకాల మున వ్యాపించుచుండును. లోక మన్యాయభూయిష్టమైనప్పు డారాష్ట్రపాలన మార్పుచెందుటకుండు లోపములు నను కూలములన్నియు నలుప్రక్కల వ్యాపించియుండుట యనుభ వైకవేద్యము. వీనికిఁదోడు సంభావనబ్రాహ్మణులు, బ్రాహ్మణ సంతర్పణలు, యజ్ఞయాగాదులు, జాతరులనుకూలములు. ఇయ్యవియే జనసామాన్యము కలియుచుండు మహాసభా స్థలములు. సభలక్కర లేదు. ఆనోటానోటఁ బాడి యావార్త పలుచోటులకు వ్యాపించుటయే యాకాలమున గావలసిన యనుకూలవిషయము.

వర్తకవ్యాపారములయం దసమాన ప్రజ్ఞకలిగి నిర తాన్న దాతయై గొప్ప కమీషనుదారై భువనగిరి, రాచకొండ, ఏకశిలానగరము, కొండవీడు, రాజమండ్రి, జావా, బర్మా, సింహళమాది యనేక వర్తకుల, యుద్యో గీయుల సానుభూతి యనుకూలము సహాయసంపత్తి కలవా డింగువ రామయ్య, అందుచేత నతనిని జనులెక్కువగా

గౌరవింతురు. మొదటినుండియు నతఁడు గాంధారముఘండి యింగువ తెప్పించువాఁడగుటవలన ఇంగువ వారందురు. ఇంగువ రామయ్య యింటినుండి మెట్లు పాలేటిలోనికే గలవు. ఆమార్గమున ననేక భూసురులు నదీతీరములయందు గుడిసెలు విడుచున్నారు. సాధారణముగా ధారుణీసురులు భోజన కాలమందును, స్నానమాడు కాలంబునను లోకాభిరామాయ ణమును ముచ్చటించుకొందురు. అందు భోజనసమయము ముఖ్యము. అట నెంతయో కాలవిలంబన ముండును. అందరు వచ్చినగాని భోజనమిడరు. అందుచేఁగలుగు నాలస్యమును గబ్బుల చే నింకింతురు. పలురకములు. పలుభాషణములు.

కొండవీటి రాకుమారిని చెఱఁదెచ్చి నాఁడఁట. ఇంత యేల. ఈరాష్ట్రములో పారిపోయిన వారిజాక్షుల సీరాజు కోటలోఁ గాననగును. సేనానులకు మంత్రులకిదే అనుమా నము. వారి చుట్టాలపిల్లలు కనుపించరఁట. నిజమే. అక్కఁడే కొండవీటివారిక దాడివెడలుదురు. ఈరాజ్యములోని శూరు లీసారి రామానాయని సేనలో చేరరు. నిజమా! నిశ్చయ ముగా చంద్రకుమారి వార్త తెలిసి అయిష్టమందినారు గుడి మెట్టవారు వారు. ఎదుటనే చింతపల్లి యున్నది. కాపాడు కొనవద్దా! రాచకొండవారో? గోలకొండతో ఘోరయుద్ధ ములోనున్నది. ఒకస్త్రీ తానే చంద్రకుమారీనన్న దలనటికిం చాడఁట. స్త్రీవధయఁట. ఛీఛీఇరువురుపురుషులు మోసగించారని యురిదీయించాడఁట. కొండవీటివారి పిల్లబండపట్టుపట్టినదఁట. రామానాయుని వివాహమాడరాదా! సీపిల్లనియ్యరాదా ! ఛీ ఛీ అందఱు అంతే. నందిగామమూల గోలగానున్నది.

మాదిరాజు పోతరాజుగారి ఆశ్రితుఁడు మోసముచేసినాఁడని వారిని చెఱసాలలో నుంచినాఁడట. ఐన సేనానాయకులుగా దేశపాండ్యాలుగా నుండు ఆదిరాజువారు, కొసరాజువారు, కోటంరాజువారు విరోధులే. కరణాలు వారితో కాపులు తదితరజాతులు అంతా ధ్రాగు, ఆఖరే ఇది.

---

## 17 చేతవోలు రాజ్య స్థితి.

రామానాయఁడు తనను వరింపని యొకస్త్రీని, వరించిన మఱియొకస్త్రీని సంహరించెననియును, జందరికుమారిని కోటలో దాచియున్నాఁడనియును నాపెను గొనివచ్చిన దేవ రెడ్డియను విశ్వాసపాత్రుని, నతని యనుచరుని సోమిరెడ్డిని, వామాక్షిని జంపెననియును కొండవీటివారైన నారాయణార్య రెడ్డిస్వాములవారిని, సూరపరాజు శారదయను వారల సంహరించెనియు కాదు, కాను. చెఱసాలయందుంచెననియు కొందఱు బ్రాహ్మణులనుకూడ ప్రాణములు తీసెననియుఁ జాలమంది లోలాక్షు లాయన ప్రాకారమున భర్తల బిడ్డలఁ దల్లులఁ దండ్రులబాసి "యలోలక్ష్మణా" యని యల్లాడుచున్నారనియుఁ గలియుగ రావణుఁడీ రామానాయఁడని ప్రజలాడుకొనుచున్నారు.

స్త్రీలుకొందఱు దుర్మార్గప్రవృత్తిచే లేచిపోయినను, అత్తల పెనుబాధల నదులలోఁబడి కొట్టుకొనిపోయినను, జాటుగా భార్యలఁజంపి పాతివేసినవారుగూడ; అంగనలు

గన్పించుచున్న రాజుగారి కోటలోనికి రాజ్యాంగమువార్తలాగు కొని పోయినారనియు; వారుజూచిరి; వీరుజూచిరి యని విపరీతముగాఁ జెప్పుచు సలికల పై సలికల సలకల్లోలము గలుగుచున్నారు. ఈవార్తలందుకొని బ్రాహ్మణులు, భద్రాజులందించుచున్నారు. కారణము: శారద భద్రాజు స్త్రీయట, వామాక్షి బ్రాహ్మణస్త్రీయట. రెడ్డెండదలు గుడ్డి నెత్తుజేసి గోవాదమిచ్చుచున్నారు. చంద్రకుమారి రెడ్డి పిల్లయఁట. తెలగాలందలు గలవరించుచున్నారు. సోమిరెడ్డి తెలగయఁట. ఏయూర నాయూర నీనీవార్తలు నేలను నింగిని నిండినవి. అల్లరిజేసిన పిల్లలను రామానాయని కోటపేరుతో నల్లరి మాన్పించునంతటి భయంకరనామధారిగ నాతనిపేరు మూర్తిమారినది. ఔరా! ఏమిచిత్రము దుష్టులకు శివ రామనామమెట్లు సింహస్వప్నమో, శిష్టులకా రామానాయ నామమట్టిదె దుష్కీర్తి కాలవాలమై దిగంతరంబుల రాత్రి రూపమున వ్యాపించెనందురు.

బేతవోలు నగరమునకు వైశాఖబహుళ పంచమి నాటికి సేనానులు, సైనికులు; రావలసినదనియు, సప్తమిదిన మున సేనానాయకుల, నుపనాయకుల నియమింతురనియు, దమ సీమగౌరవమును నిలుపుకొనవలసినదనియు. బేతవోలు సీమయందంతట రాజభటులు జనులబిలుచుచున్నారు. వారి పలుకు లాలకించువారు లేరు. ఊరిపెద్దలు మేము చెప్పఁ జాలము. నామాట వినువారెవరు? నేజెప్పినరారు. నేను రాజాలను. నాకు నస్వస్థతగా నున్నది యనుచున్నారు. పిన్నలు, పెద్దలు చెప్పినగాని వినరు. మామాట వినువారెరు?

అందరు వచ్చిన నేను వచ్చెదను. ఎవరు రాక నేను వచ్చిన లాభమేమి? అందరును రావద్దా యనుచున్నారు. ఆరాజ పురుషులు గ్రామాధికారులఁ బ్రజలఁ జేర్చుమనుచున్నారు. తలారులు గృహాగృహముల కరిగి పిలుచుచున్నారు. పలుకు వారు లేరు. ఉద్యోగుల పలుకులాలకింప నెవరురారు. సభ లేమియు జరుగుటలేదు. ఒకవేళ నేకొందరైన జేరుచో మరుమాట నొసంగువారు లేరు. సైన్యములఁ జేరుటకు నామావళి నిచ్చువారు లేరు. జనుల బ్రోత్సాహించువారసలే లేరు. కాని గ్రామోద్యోగులు రాజాజ్ఞ నిష్టమున్నను లేకు న్నను నాలకించవలసినదేగదా!

ఒకయూరుగాదు. ఒక పల్లెగాదు. ప్రతియూర నంతియే. ఏయూరినుండియైన నొక్కరైనను రాలేదు. కర్షకులయియున్న యుద్ధభటులు మాయిచ్చవచ్చిన వచ్చెదము, లేకున్న లేదనుచున్నారు॥ "సిరు శిసు పారవేయుచున్నాము. మాపై మీకుఁ బెత్తనమేల ననుచున్నారు. దేశము సుభిక్షముగా నుండఁగా యుద్ధమేల? దేశమును భద్రముగా నుండ నీయఁజాలరు. ప్రాతపగల లాభములఁ జూచుకొనుచు తామొడముగానుండి ప్రోత్సహించి, కతికతారు లొసంగి తమబదులు జనులను జంపుకొనుచుందురు. చంపించుచుందురు. పసులచావు వీరికి వేడుక. ఒకప్రాణినైన బ్రతికింపలేరు. చంపు మొనగాండ్రైనను గారు. కబురంపుచున్నా" రనుచున్నారు.

భటులు రానివార్త రానునాయఁ డాలకించినాడు. వైశాఖ శుద్ధ దశమి. ఉద్యోగులకధికారమిచ్చినాడు. ఉద్యో

గులు వచ్చుచున్నారు. గ్రామస్థుల మరల నడుగుచున్నారు. దండోరా వేయుచున్నారు. జనులు బయలువెడలుట లేదు. గ్రామములయందలి మునసదార్లను బిలిపించి మీరే కారకు లని బంధించి జేతవ్రోలుకోట కంపుచున్నారు. వారియందు ప్రేమగల వారు బహిరంగముగ వ్యతిరేక ప్రచారము సేయుచున్నారు. దెబ్బదగిలిన ప్రతాచు వలె లేచుచున్నారు. సైన్యముల చేర వద్దనుచున్నారు. ఒకరిని బంధించుకొనిపోయిన సింకొకడు లేచి నిలువబడుచున్నాడు. రాజుల మాటల వినులుంచను డనుచున్నారు.

"రాజు లనవసరముగా యుద్ధము ప్రకటించెదరు. వారలకై యొకులేల యుసురుల విడువవలయును? పరుల నెందుకు సంహరించవలయును? అదియేనట రాజభక్తి. అట్టి వారికి ప్రాణములు పోయిన స్వర్గమట. గెల్చిన పొలము బహుమానమట ఇది ధర్మమట. భక్తియట. ఇవిస్వార్థ పరులగు కొందరు పలుకు ప్రసంగములు. ఒకరిని దోచుకొనుట ధర్మమా? అందుల కేగదా శస్త్రముల నుపయోగించుట. ప్రాణముతీయుట. ఈలాభ మెవరికి? రాజులకు. ప్రభువులకు. భాగ్యవంతులకు" అని జనులాడుచున్నారు.

రాజొక రాజీవాక్షిని వరించును. ఆపైకై వాజులు, సైన్యరాజులు నిరుదెరంగుల బలియగుచున్నవి. రాజుయొక్క-యాయల్పస్త్రీ యభిలాషకై యెంతమంది నశింపవలయును. ఇది ధర్మమట. రాజొక దుర్మార్గకార్యము జేయును. దాని సంరక్షణకై యనవసరముగ లక్షలజనుల మారణ. ఔరా! ఏమి యీదారుణము. వారిప్రాణములతో సరియా! కాదు

కాదు. ప్రజలు ధనధాన్యము లోనంగవలయును లేదా వారి గృహములు లూటీయగును" అని యనుచున్నారు.

"దేశరక్షణకై రాజేర్పడెనుగాని పరులపై స్వారి జేయ జనులఁ బీడింపనేర్పడలేదు. దేశరక్షణకొరకై సైన్యము లేర్పఱుపఁబడియెనుగాని యొకనిలాభమునకై నిర్మింపఁబడ లేదు. ఈయుద్ధము ప్రయోజనకారిగాదు. జనలాభమునకై యీసంగ్రామము ప్రారంభింపఁబడలేదు. మానవతుల మాన హరణములకై మనమా మానవపతికికాదు, కాదు. మానవతీ మానహరణమునకు సాయముచేయుటా? అతఁడొనరించిన మేలేమిటి? అతని రాజ్యపాలనయందలి యీవిషయమున కేమందురు? ఏముఖము పెట్టుకొని మీరు మమ్ము రాజునకు సహాయము చేయమందురు, మీరు మాలోవారుకారా. మాలోఁజేరుఁడు" అని అనుచున్నారు.

"చేతవోలుసీమలో రాజు ధనార్జనసేయ నీవిధమున జనులకుఁ గలుగజేయు సుఖము నాజ్ఞను విమర్శింపుఁడు. జూదపు దుకాణములను బెట్టియున్నారు. అందు రాజ ముద్రాపత్రము (లైసెన్సుపేపరు) గలవారే రావలయును. వారియాస్తి యన్యాక్రాంతము జేసినను జెల్లదు. ఆదుకాణ మున రాజపురుషుఁడుండును. న్యాయాన్యాయవిచక్షణయతనిది ఇతరులు జూదమాడిన మహాదండన. తదితరంబుల నాడరాదు. తెలిసినచో ధనరూప శిక్షార్హుడగును. ఇట్టి రాజాజ్ఞలేనిచో జనులు జూదములందు పోరాడుకొని ప్రాణములఁ బోగొట్టు కొందురట. వారిరక్షణకైయట యీయాజ్ఞ.

ఇంకొకటి యాలకింపుఁడు. జారత్వమున ననేక యువ

ములు వచ్చుచున్నవియట. స్త్రీ పురుషాదుల సాంఘికకట్టు బాపని వేధించెదరట. రాజుగారికి ధనమంపి యొక రాజాజ్ఞా పత్రమును గాంచినచో, వారి నెవరేమి చేయరాదట. జారుల యిండ్లను సర్కారువారే నిర్మించి యందు నివసించు వారికి నదుపాయములు చేయుదురఁట. అది ధనమిచ్చి కొనవల యును. కులీనులైనను సరియే. విధవలైనను సరియే. రాణి వాసపు స్త్రీలయినను సరియే. యీ దుస్తు తలపైన మేలి ముసుగు వేసుకొని పోవుచున్న నెవ్వ రాటంక పెట్టరాదఁట. వారి నెవ్వరైన యాటంక పెట్టిరని తెలిసిన విచారణారహిత ముగా శిక్షకుఁ బాత్రుఁడఁట. వీనివలన జారులను నియమము ప్రకారము సంచరింపచేసి సుఖింప జేయుదురట.

ఇంకొక విషయము. కల్లుచెట్లు స్వంతమయినను గొట్టుకొన రాదఁట. శిక్షయఁట. కల్లు త్రాగెడివారి కవియే యానంద మగుటచేతను, కల్పవృక్షమగు నీ తాటిచెట్టు రాజ్యాంగము వారికిఁ బన్నొసంగఁ జాలుటచేతను, నియ్యది పూజ్యమగు కార్యమనియు, మఱియు నిదియే దేవతల సుధ యనియు, మధువగుటచేఁ ద్రాగఁ దప్పుగాదనియుఁ బూజల యందును గొంద రుపయోగించు కొనుటచేఁ బూజార్హ మనియు, కాన దానిని సేవించువారి, దూషించువారలు శిక్షార్హులనియు, నా వృక్షమును బడగొట్టువారు రాజునకు నష్టము గలుగజేయు వారగుట రాజద్రోహులనియు శాసిం చుట యేటి రాజనీతి ?

ఇంకొక విషయము. ఏ శిక్షకైనను, ధనరూపమున గాని యింకొక రూపమునగాని శిక్ష లేదఁట. మరియు నింకొక

విషయము. వడ్డీవ్యాపారులు నూటికి కైదురూపాయ లాదా యముపైఁ గప్పము గట్టుకున్నవారి ఋణముల నెగవేసిన బాపములేదఁట. తప్పుకాదఁట. ఆదాయపు పన్నుండిననే నది చెల్లునట. తాటాకుల సూర్యచంద్రుల సాక్షుల నమ్మి చరించునీతి నీ తీగున మాయించుచున్నాడు.

పగలు దొంగతనము చేయగలవానికి బహుమతి యిచ్చెను. ఇట్టి జార, చోర, జూదరీంద్రను, ద్రాగుబోతుల రక్షించు రాజుండిన నేమి ? నుండిన నేమి ? ఇట్టి యపకారికి సహాయము చేయకుడు. జనులిట్టి కార్యములకుఁ జేయూత నొసంగకుఁడు. సైనికులుగాఁ జేరకుఁడని యుద్బోధింపసాగిరి. జను లానందముగా నాలకించుచున్నారు.

బలవంతపరచు రాజపురుషుల యూరుపేరులు జాడ లెరుంగఁ బనుటలేదు. జనులు లేక రాజ్యములా ? సైనికులు లేక సంగరములా ? ధాన్యము లేక సంతర్పణలా ? ధనము లేక దానములా ? ఎవ రేమి చేయఁగలరు. జనులు మూఢు లయి సంచరించు చున్నంతవరకు బాలకులు, నుద్యోగుల యాటలు సాగును. లేనిపోని కథలఁ జెప్పి యుబ్బి తబ్బి బ్బులుచేసి, లాలించి బెలించి చేతిక్రిందకుఁ జేర్చుకొని, సైని కులుగాఁ జేర్చుకొని, వీరిచేత వారిని సంహరింపఁజేసి రాజ్య లాభముఁ బడయుచున్నారు. వారికి వారి లాభమే కావల యును. అనేకుల యుసురు లరిగినను సరియే. దేశము నాశమైనను సరియే. వారిచేత వారిని జంపించి, తాను వీర రసము మూర్తీభవించిన వానిపోల్కి బిరుదములఁ దగిలించు కొని కులుకుచున్నారు. వీరులఁట. మహావీరులఁట. వీరు

పోవరు. అట్టి ప్రదేశముల కుపసేనానుల, సైనికుల నంపుదురు.

విచారించి చూడుఁడు. మహాసామ్రాజ్యము లేలుచున్న వారెందఱో గలుగఁగదా! నిజముగా వీరు మహాయుద్ధము లొనర్చి గడించిరా? లేక ప్రాణముల విడనాడిన వారు గడించిరా? గతించిన వీరపురుషుల రక్తములైన నే సామ్రాజ్యము లేరుపరుపఁబడినని. దానిని మరచి ఈ స్వార్థపరులు, స్వీయగౌరవ మాత్రాభిలాషులు, న్యాయవేషధారులు గౌరవాడంబరములఁ గులుకుచున్నారు.

పాలించువారెడముగానుండి రాజభక్తియని, దేశభక్తియని, దేశరక్షణము, మతరక్షణము, దైవ సేవయని యనేక రకములుగాఁ బ్రబోధించి యమాయకులై చేరిన వారిని బోరించి, చంపించుచున్నారు. చచ్చిన శాశ్వతకీర్తియఁట. ముందాలాగున జనులు గుంపులు గుంపులుగాఁ జేరుటకయి గ్రంథములు వ్రాసి దేశదేశముల వ్యాపింపఁ జేయుచున్నారు. ఇదెట్టి రాజనీతి? ఎట్టి రాజభక్తి? ఎట్టి దేశభక్తి? దేహము బుద్బుదమని, కీర్తి చిరస్థాయి యని స్వర్గద్వారములు దెరచుకొని యుండునని వర్ణించి దురమునందు దుమికించెను.

పరశురాముని కీర్తియం దెంతమంది శిరములు దొల్లినవి. హస్తినాపుర రాజ్యమునకయి యెందరి మస్తిష్కములు రాలినవి? అలెగ్జాండరు ప్రతాప వ్యాపనమున కెందరి కాయములు కూలినవి. పాటలీపుర రాజ్యనిర్మాణమున కెందరి ప్రాణములు పోయినవి, ఆంధ్రసామ్రాజ్యమునకయి యెందరి శిరములు దొరలినవి. మొగలు సామ్రాజ్యమునకయి

మొందరి శవములు నేలబడినవి. ఆంగ్లేయ సామ్రాజ్య స్థాపన కెందరి కంఠము లుత్తరింపఁ బడినవి. ఐరోపా సంగ్రామం బునం దెందరి వాయువు లపహరింప బడినవి. కటకటా! ఇట్టి దారుణ సంగ్రామంబుల నాపు దారిలేదా? ఇంత జరిగిన ఫలిత మెవరిది? ప్రభువులది. భాగ్యవంతులది. వారేద ముగానుండి జగడ మాడించెదరు. అవస్థల పాలగునది బీదలే. జీతమున కాసపడి జీవితముల వదలునది బీదలే.

బేతవ్రోలు సీమాధిపతి దురాచారము జనుల కయిష్టమయ్యెను. సైనికులు చేరుటలేదు. పైపెచ్చు బంధించుట. వారి బంధువులు, వారిబంధువు లుచెలరేగుచున్నారు. రాజకుమారిని నింక నా సీమలోని వారిని జెఱబెట్టనున్నారని గాలికబుర్లు. దేశ మల్లకల్లోలముగ నున్నయది. ముందేమి గానున్నదో?

---

## 18 వేదగిరి ప్రయాణము

శ్లో॥ ఉగ్రవీరం మహావిష్ణుం। జ్వలంతం సర్వతోముఖం
నృశింహం భీషణం భద్రం।మృత్యు మృత్యునమామ్యహం

జయ్ నరసింహా! జ్వాలానరసింహా! వేదగిరి నరసింహా చేమకో నరసింహా! రక్షించు నరసింహా! ప్రహ్లాదవరదా కాపాడరారా! చెంచులక్ష్మీ ప్రపతీ!చేపట్టరా! యనుచు జనులు తండోపతండములుగా గొండబాటప్రక్క నుండి పెద్దాపురం

మూాలగ గొండపైకి నెక్కుచున్నారు. కొందఱు ద్విచక్ర శకటములపైన, జతుచ్చక్ర రథములపైన నాందోళికలపైన డోలికలపైన నరుగుచున్నారు. అశ్వికులు, వృషభవాహనులు వారల వెంబడించుచున్నారు. చెంచులు, చెంచితవేట నరసింహమూర్తి యాపెను గాంచుట, ప్రేమించుట వివాహమాడుట మొదలగు నంశములను విన సొంపగునట్లుగ వైష్ణవులు నుత్సాహముల గల్పించుచుఁ జేగంటల మ్రోయించుచుఁ గీర్తనలు పాడుచు, నెమలి నున్న నెమిలిపింఛముల నృత్యములు నరుల నయనానందకరములుగాగ నృత్యముల గావించుచు దనువును భిక్షుక కృత్యము నెరవేర్చుచుండిరి.

"ఈమార్గమున నే నరసింహమూర్తి చెంచితను వెన్నాడినది. అదియే వారిరువురి సమాగత ప్రదేశము. ఆకొండయే యాయన వేటాడినదని నుకథల భక్తిని గలిగించి యుద్రేకపూరితులఁజేయుచుండ దత్కాల వచనరచనా విశేషముల ధన సంపాదన సేయు నాశ్రిత భూసురుల చాకచక్యమున కమందానంద మందుచు నీరు మజ్జిగలు మొదలగు శ్రమ నివారణోపాయముల నెలకొల్పి నరుల శ్రమ వాయించుచు మహాభక్తులై ప్రజాసేవ చేయు భాగవతోత్తముల సంసరణంబున కాత్మయం దలరారుచు నెత్తము నెక్కుచున్నారు. నెమ్మదిగ నర్రలు నడచుచున్నయవి. రాతితోవ యగుటచే రోజాలు కటకటమనుచున్నవి. చమురు వేయనందున నిరుసులు కిరుకిరు మనుచున్నవి. గుంటవచ్చినది. అమ్మా జాగ్రత యని తోలువానిమేల్కొలుపునకు మెచ్చుచు వెనుకయందు జీమ దిరుగ సందు లేకుండ నరసింహనామస్మరణ సేయుచు

వచ్చు నరుల బారుల కపారానంద మందుచు మధ్యమధ్య తీవ్రదృష్టినిబఱపి యేదియో యోచించుచు నొకయువతి చతుర్చక్రశకటము నధిరోహించి యాత్రయాత్రికుల మధ్యఁ బయనము సేయుచుండె. వైశాఖ శుద్ధ త్రయోదశి, చతుర్దశియే నరశింహస్వామి తిరునాళ్ళు.

రెండు మైళ్ళు కొండపైన నడచిరి. ఆరు ఘడియల ప్రొద్దెక్కె. కొండ మాదుననుండిరి. పూర్వాపర దక్షిణ దిశలు గన్పించుచుండెను. ఉత్తరముందు శిఖరంబులఁ గ్రమ్మబడియుండెను. పశ్చిమ, దక్షిణదిశలుగ సంచరించుచు కృష్ణవేణీతల్లిని గన్నార కాంచిరి. నద్యకి నమస్కరించిరి. తీవ్రకృత్తికాకార్తె యెండకుఁ బరితపించి కృశించు సకల వ్యక్తులవలె నామెయుఁ గృశించి బక్కచిక్కి యుండెను. లోపలి భాగమే స్వచ్ఛసుధారసమయమై సునీలాకాశచ్ఛాయలచే నిగనిగ లాడుచు నీలాలవంటి నీళ్ళను గల్పితసార్థకనామ మలంకార ప్రాయముగ ధరించి యుండెను.

వేడిగాలి సాగినది. మాడు మాడసాగినది. కాళ్ళు కాలసాగినవి. శృంగ మెక్కుటచే నంగముల హంగు భంగమగుచుండ నంగనాది బలహీనులు చలవ పందిరులక్రిందఁ జేరి విశ్రాంతిని స్వాంతంబులు శాంతిల, నవసిన యవయవములు రవరవ కవటిల్ల సేదదేరిరి. ఆకంతయు రాలిన మ్రోడులతో నిండినను జూచిన నొకవిధమగు నామోద మొసంగఁజాలునా ప్రకృతి రామణీయమునకా రామామణి యాబండి నొగలునకు జనుదెంచి నిలుచుండి తన చేరెడంత కనులతో నానలుశలఁ దానవలోకించుచుఁ బ్రకృతి విశేషములకు బ్రకృతి

మాన్పులకు నిజప్రకృతికి నీశ్వర విలాసానుభవము గదుర నానందరసముఁ జెందుచు డెందము పరవశముందఁ గొందాము రలచేఁ బూజించినటుల నందుండియే యిందిరానాధునకు వందనం బాచరించెను.

సౌందర్యము మూర్తీభవించిన చందంబుననున్న నా సుందరాంగిని గాంచిన యాబాలగోపాలము "ఈమె యెవరు? ఎవరని" యొకరినొకరడుగుకొనుచుండిరి.

బేతనోలేమో! అయిన ముక్కేశ్వరమార్గమున గాదా వచ్చునది! నందిగామేమో! కొండపల్లియఁట! కొండూర న్నారు! ఏమో! ఎవరో! గొప్పయింటి ఆడపడుచువలెనున్నది. అలానేమి! చేతికొక బంగారుఁపుతాటయినా లేదే! చేత మట్టి గాజులే! మెడలో నల్లపూసలైనా లేవు. ఏదో సన్నని గుండ్ల పేరు! ఇతడిదో బంగారపుదో! కాళ్ళ సన్నని వెండికడియాలే! ఇంతే బండారము! సామాన్యురాలే! చక్కనివాళ్ళు బీదవారి-ట్లో బుట్టరాదా! బీదల కిన్నిగాళ్ళ బాడ్లేమి! అయిదాఁగు రున్నారు.తినుబండారము లుంచుకొనుట కుండవద్దా.అయినా ఆమెనే అడుగుదామా! ఆమెను బలకరింతమా! వారు మాట్లాడించిన బాలేలులే ప్రసంగించుచున్నారు. ఆమె మాటాడుట లేదే! ఏయూరేయూరు! తెలగాణమా! చిగురు కోటా! కోల్నేరు కాగ్నేయముగా నున్నదేనా! దానినే కొల్లేరుకోటయని యంటాను. కాదమ్మా! చూడవే! ఆకట్టు బొట్టు జుట్టు కెడివారి చిన్నదిలాగానే యున్నదే! దేశాచార మేమో! వీరి పాలేర్లు తెలగాల మంటున్నారు. పేరు చంద్రమ్మట. ఇంకను పెండ్లికాలేదఁట. తగినవర లేడని మానిన

దఁట. పోనీ! వేదగిరి నరసింహస్వామిని ప్రార్థించుము. మంచి మగని చూపించును.

ఎందుకు మనకీ యూహలపై యూహలు. లోకమున నెందఱు సుందరులు లేరు. అందఱికన్న నిక్కడ నెక్కువే మున్నది? ఏల అఱ్ఱెత్తి యటు జూచుచున్నారు. ప్రొద్దు ఇంక నొకబారెడెక్కిన మనమీలోయలోనే మాఁడెదము. ఆ రెండవకొండ నెక్కినగాని మనము త్వరగా చేరలేము. ఆకొండ దిగి యరక్రోశమేగిననే వేదగిరిభూధరము మెట్టెదము. లెండు లెండని కొందఱు ప్రయాణమగుచున్నారు. కొందఱు బయలుదేరిరి. దాని కడ్డముగా నీరమణి యొయ్యారమును, సుందరాకారమును గన్నారఁగాంచు పరివారమును, వారికన్న నబ్బురంబందు బిబ్బోకవతులదాటి పోఁజాలక నానాతీర్థయాత్రికులందఱా మార్గమునందుఁ గ్రిక్కిరిసి యుండిరి. ఎఱ్ఱనియెండలో నఱ్ఱెత్తి చూచుచు నెత్తి మాడఁ జుఱ్ఱుమని పాదములు మాడ నఱకాళ్ళను మార్చిమార్చి పైకి నెత్తుకొనుచు విసుగుకొనుచుండిరి.

రెండెడ్లపెట్టెబండి యొకటి యాప్రదేశమునకే తెంచెను. దానియం దొకఁడు నతనితల్లియు, భార్యయు నేక పుత్రుఁడు నుండిరి. అతని స్థితిగతుల ఠీవినిబట్టిజూడగా నొక కులీనుఁ డనియు, యుద్యోగియనియు, భూస్వామియనియు, లేదన్నసామంతప్రభువనియు, విత్తవంతుఁ డనియు, జిత్తమునకు హత్తుచుండును. ముందొకఁ డాశ్వికుఁడు త్రోవఁజేయుచు నడచుచుండెను. కొండ నెత్తికివచ్చిరి. మూఁగియున్నమూకలను గారణమును విచారించుచుఁ దప్పుకొనుచుఁ బోవుచుండిరి.

ఆసమయమున నొకభిక్షుకుఁడు కల్పితదీనావస్థయుతుఁడై యాయువతిని యాచించెను. కరుణారసదేవతవోలెఁ జూచుచున్న యానవల తలమానిక మాతని కరతలమందొక వరహా నిడెను. ఇంతలో నింకొకఁడు మఱియొకఁడు, వేలొకఁడు పదులు వందలాశకటమును జుట్టుముట్టిరి. ఆసుకుమారశరీర విసుగుకొనక తలకొక వరహాచొప్పున బారవేయుచున్నది. వేమనయోగికి జయ్. వేమనయోగికి జయ్ యనుచున్నది. అందఱేపె మహాయోగిని వేమనశిష్యురా లనియు, మహిమాన్వితయనియుఁ దలంచుచున్నారు. చెంచులు, జంగాలు, బ్రాహ్మణులు, భట్రాజులు, సాతానులు తదితరులు జయ్ అమ్మగారికి జయ్. చంద్రిగారికి జయ్. వేమనయోగిశిష్యురాలికి జయ్ యని యేకగ్రీవముగా; దశదిశలు మాఱుమ్రోగునట్లు చేగంటలు, పెద్దబాకాలు, రండోళ్ళు, గోముఖాలు, తప్పెట్లు, పీరణాలు, చేచప్పట్లు యెవరికి వీలైన వానిని వారలు మహానందముతో జయజయధ్వను లొక్కసారి యొనర్చిరి. కొండయుఁ బ్రతిధ్వను లొసంగ నాతూముల ధ్వని దశదిశలు నిండెను. ఆశైలమందున, నక్కలు,కుక్కలు, లేళ్ళు, తోడేళ్ళు ఇంతయేల. సకలజీవరాసు లుక్కిరిబిక్కిరియై చెవులు గింగురుమన యెడదబెడిదముగ బెగడుపడ ప్రాణములు కడబట్ట నిశ్చేష్టత జెందినవి. ఆజనులవీనులు గింగురుమన యొడలు జలదరింప నానందమున మైమఱచిరి. కవులయినచో నుఱుముల మీఱునని వర్ణింపకమానరు.

అట్టివీనులధ్వని వీనులసోక బెగ్గడిల కుండుటకా యుద్యోగి బండియెద్దులా సవ్యసాచి దివ్యాశ్వములా? పాప

మాయొద్దగుండెలదిరినవి. మోరలెత్తినవి. మిట్టిమిట్టిచూచినవి. ఒక్కదూకు దూకినవి. చెరియొకదారి మెడపలుపులు తెగినవి. బండిమూరెడెత్తున కెగిరినది. కొంచెము ముందునకు జరిగినది. ఒకగాలు శిలపైన, రెండవది పల్లమున బండి యెగిరినది. హర-హరా, శివ-శివా, రామరామా యనుచున్నారు. పడినది ఆగలేదు. దొర్లినది. పల్లము. లోయ. నలుబదిబారల యగాధమగులోయ. నిట్రువగానున్న కొండ రాయి. నాగజెముడుకంపలేగాని చెట్లుగూడలేవు. దొరుటకయినను నలవిగానిది. ఎవరికేమి చేతనగును? మానవసాధ్యమా? అందఱు దదేకదృష్టితో జూచుచున్నారు. ఎవరేమిచేయగలరు? నరసింహానామస్మరణ. ఆబండిలోనివారి హృదయకుహరము లెట్లదఱుచున్నవో? వారొకరిపై నొకరు బడుచుఁ జచ్చితిమను భయోద్రేకంబున నెట్లున్నారో? ఎవరు వచింపఁగలరు? పాపము మాతాపుత్రకళత్రములతో గుడిమెట్ట యొడయుఁడు పాపారావునాయఁడు పాపమధోగతి పాలగుచున్నాడు.

హరహరా! దయాసాంద్రుడే! దీనజనకల్పద్రుమమే! సజ్జనుడే! రక్షించువారు లేరా! బండి టపటపయనుచున్నది. అయ్యో! రక్షించరా! రంగా! రంగా! తల్లీ! మహాదేవీ! అయ్యో!

మ॥ కరినేలిందిహుళక్కి, ద్రౌపదికిఁ గోకల్ మెచ్చి యిచ్చింది
దబద్ధం బబ్బర కాకాసురుని గటాక్షమున జేపట్టిందబద్ధంబ
హాహా శరణన్నఁ బగవానితమ్మునికి రాజ్యంబిచ్చుటల్ గల్ల
ఇ। త్తరినన్నేలిన నిక్కమీకథ లనంతా! భావనారాయణా!

ఇంతలో మెఱుపు మెఱసినట్లయినది. చండికవలె ప్రచండరీతి వెలుంగునొక స్త్రీ యాప్రక్కనఁ బ్రత్యక్షమయినది. నడికట్టుకట్టినది. తీవ్రదృష్టి నున్నది. వీరరసావతారమున భ్రాంతిగొల్పుచున్నయది. జనులందఱు జయ్ మహాదేవి! జగజ్జననీ జయ్! ఆపదోద్ధారిణీ జయ్! అనుచున్నారు.

---

## 19. వేదగిరి ఉత్సవము

శ్లో॥ గరుడధ్వజాయ తాపత్రయోపశమనాయ
భవౌషధాయ తృష్ణాది వృశ్చికభుజంగ
జలాగ్నిరోగక్లేశ వ్యయాయహారయే
గురవే నమస్తే నమస్తే నమస్తే నమః॥

"లక్ష్మీనరసింహా! జ్వాలానరసింహా! జ్వలజ్వలప్రజ్వల ప్రజ్వలజ్వాలానరసింహా! జయజయ ఉగ్రనరసింహా! వీరనరసింహా"యని నరులు పలుతెఱఁగుల స్తుతించుచున్నారు. దేవాలయముచుట్టు తిరుగుచున్నారు. భజనలు సేయుచున్నారు. చుట్టునున్న చిన్నచిన్న దేవాలయముల సేవించుచున్నారు. కొందఱు దక్షిణద్వారముననున్న సోపానముల గుండఁ గ్రిందికిదిగుచున్నారు. దిగినకొందఱు కృష్ణామహానదియందు గ్రుంకులిడుచున్నారు. కొందఱు పలువిధములను జేటల జ్యోతులా నదీతీరంబుల వదలుచున్నారు. కొందఱుఁ పల్లెవాండ్రు సాలిగ్రామ నరసింహమూర్తి చుట్టు యీదుకొని

ప్రదక్షిణము సేయువారిని మకరములనుండి రక్షించుటకై వాని యిరువులఁబరిశీలించుచు, వలలు వేయుచు, జలముల నల్లకల్లోలముఁజేయుచు దూరములందున్న మకరములను గూడఁ గలతనొందింపఁజేసి తరుముచున్నారు. చపలనేత్రిలు పుట్టిమీదఁగూర్చుండి పల్లెకారిదానిని బయినింపఁ జేయు చుండ నాసాలగ్రామమును ప్రదక్షిణము సేయుచున్నారు. ఆ సమీపముననున్న నార్యభట్టారక సిద్ధాంతజ్ఞులు, సకలజీవ రాసులధరించి భూమి తనచుట్టుదాను ప్రదిక్షిణముగాఁ దిరుగు, సూర్యునిచుట్టు నిల్లే దిరుగుచున్నదనియు; నిరవకాశమేకృష్ణ ఆకాశమే వేదగిరి; చిచ్ఛక్తియే జలంబు; సాలగ్రామమే సూర్యుఁడు, పుట్టియేభూమి, అందలి సుందరులే సకలచరా చరంబులనుచుండిరి. కంటికిఁగానరాని విషయములను మన వారెట్లుఁ గాంచజాలిరని కొందఱనుచుండిరి. సిద్ధులు వారి యోగబలమున నెంతటి విషయమైన నెరుంగజాలుదురు. మన పూర్వోన్నత్యమును విచారింపక మనము ప్రయత్నింపక యెవరినో చూచి వారు విద్యావంతులు, మన మల్పజ్ఞుల మను కొనుట యజ్ఞానమే! ఆహా పుణ్యాత్ములము. మన జన్మ ములు ధన్యమయ్యెను. నరసింహమూర్తి ... రూపమున ప్రజల భరింప నిటనున్నాఁడనియు, నారు నెలలు నివేదనగాంచి దర్శనమిచ్చి యనంతరము జలంబులం దదృశ్యమైరూపము నుపసంహరించుననియు, మేదినీసురులు మహాత్మ్యంబు వర్ణించుచుండ, ముదుసలులగు యమాయకులు ముప్పిరిఁ గొనుభక్తి, జ్ఞానవైరాగ్యంబులతో "స్వామీ రక్షింపుము. నీవే సత్యమగు వాఁడవు; సకల చరాచరంబు మిథ్యారూ

షమే; మాకుఁగావలసిన దేమి? కాటికి గాచుకొనియున్నాము."
అనియుఁ దజ్జన్య సుప్రలాపము లాడుకొనుచు నానంద
భాష్పంబుల విడుచుచుండిరి.

దేవాలయో పరిభాగంబున ధ్వజ స్తంభమున నొక
వ్య కిని గట్టిరి. వేలము వేయుచుండిరి. బంధులలోని వారే
గాక యన్యులా వేలములో జోక్యముఁ బెట్టుకొనరాదు.
కొంతకవివిచి యామూల్యము స్వామికిఁ గానుకగా నర్పించి
యితనిని విడిపించును. కొన్న వానికిఁ గొనబడిన వాఁడు కృతజ్ఞుఁడై యుండును. ఇది యొక రకమగు మ్రొక్కుబడి, తిరు
పతి వెంకటేశ్వరునకు దల దీలావెట్టి మ్రొక్కుబడియో,
ని వేదగిరి నరసింహస్వామి కడన మ్రొక్కుముఖ్యము. కృతా
ర్థులే యీ మ్రొక్కుబడుల నర్పింతురు.

ఈ వేదగిరి నందిగామ తాలూకాలోని ముక్త్యాల
యని పిలువబడు ము క్తేశ్వరపు జమీలో ముక్త్యాలకు నైదు
మైళ్ళు తూర్పుగాఁ కృష్ణానదీతీరమున నుత్తరమున నాని
యున్న దండికొండకుఁ బేరు. ఆ కొండ కృష్ణలోనుండి యే
ప్రారంభించిన ప్రదేశమున కరక్రోశము దూరమున దూర్పుగా
వఱలఁ గృష్ణాతటమున కానియుండును. అటనుండి నొకటి
రెండు గుట్టలు తూర్పునగలవు. అటనే పెద్దాపురము గలదు.
వేదగిరి పశ్చిమభాగముననే వేదగిరిస్వామి, లక్ష్మీనరసింహ
స్వామి, వారి దేవస్థానము గలదు. యజ్ఞశాలలు, సత్రము,
పాకశాలలు, చిన్న చిన్న దేవాలయములు, నెన్నియోకలవు.
ఆ ప్రాకారమునకు దక్షిణముననే ద్వారము, సోపానము లేటి
లోనికిఁ గలవు. ఆ సోపానములకు ముందిరువది గజములలోఁ

బదిగజముల వలయము గలిగి సాల్గ్రామమను పేరున గ్రాలు గ్రామమున్నది. ఇంక నిరువది గజములవరకుఁ గొండసీటిలోనికిఁ జొచ్చినది.

ఇది ప్రబల ప్రఖ్యాతిఁ బొందిన ప్రదేశము. పురాణములయం దీ క్షేత్రమహిమ వర్ణింపఁబడి యున్నది. ఇప్పుడీ యూరు, దేవాలయము, ముక్త్యాల జమీందారుల స్వాధీనమందున్నది. మన కథాకాలమున బేతవోలు ప్రభువుల పాలన యందున్నది. ఆ బేతవోలుననే పూర్వ మమరావతీ ప్రభువులగు వాసిరెడ్డి వెంకటాద్రి నాయుఁడు మహారాజులు తమ తండ్రిపేరిట జగ్గయ్యపేట యని నామకరణము గావించుటచే బేతవ్రోలు పేరు మరుపున బడినది.

ఈ బేతవ్రోలు సీమాధిపతి రామానాయుఁడు గారు. నల్లగొండ జిల్లాలోనున్న రాచకొండ ప్రభువులగు శ్రీఅనపోతానాయనంగారికి సామంతులు. తన సైన్యములను దమ రాజ్యమునకుఁ బూర్వభాగంబున నున్న గడ్డిరాజుల నుండి యపాయము రాకుండుటకై నీ రామనాయనింగారికి స్వాధీన పరచిరి. ఇతఁడును బౌరుష బల పరాక్రమాది మహాలక్షణములు గలిగినవారిలో నొకఁడని పేరుగాంచెను.

సీమాధిపతులే తమ సీమలకు సర్వాధికారులయి వర్తించుచుండిరి. ప్రజా ధన మనోప్రాణంబుల ధరారమణుల కరతలము లందుండెను. వారి దయావాత్సల్యములే, పరమాత్మని దయావాత్సల్యము లనం దగియుండె. క్రౌరయు, నురిశిక్షయు గంభీనీధవుల కూతికర్రలవంటి శిక్షలు, అందుచే వారే "నా విష్ణుః పృథివీపతి" యను బ్రాహ్మణుల స్తోత్రం

బుల కుబ్బి తబ్బిబ్బులై తమ యాజ్ఞయే రామాజ్ఞగాఁ జరింతురు అట్టి ప్రభువులు మంచివారైన జనసౌఖ్యము. చెడ్డవారైన ప్రజాపీడనమన నేల? సామంతప్రభువులైనను, స్వామాట్టులైనను దమ్మాశ్రయించిన వారియొక్కయు, నయయాయులయొక్కయు, నీతి యవినీతులపై సంచరించుచుందురు. వీరిస్వేచ్ఛావృత్తి సరికట్టిన దేశము లందైనను ముఖ్యాధికారులయొక్కయభిమానులయొక్క సహాయముచేఁ బ్రభువులు తమతమ దుష్కార్యాభీష్టమును నెరవేర్చుకొనుట కనేక యవకాశము లున్నవి. పాలక పాలితులు, జనక సుతుల కైవడి దైవభీతిచే, న్యాయాన్యాయ విచక్షణచే సకలభూత దయాంతరంగులై, సర్వసోదర మోదాభిలాషులై సంచరించు చుండిరేని యిరువురకు సుఖము. రాజ్యము రామరాజ్యమై రాణించుచుండుట నిక్కువము. కానిచో ముప్పుతప్పక వాటిల్లును. బలవంతుఁడు బలహీనులను వ తిడిచేయు. సుమతీ శతకకారుఁడు సెప్పినట్లు "బలవంతుడ నాకేమని పలువురతో నిగ్రహించి పలుకుట మేలా" యను పద్య మనుభవములోనికి వచ్చుననుట లోకమునందు గనుపించుటలేదా? కైజరు, జారుల రాజ్యభ్రష్టత్వము లెరఁగమా?

పాపారాయఁడుగారు చంద్రమ్మ మహాత్మురాలిచే రక్షింపబడి యామె ప్రయోగించిన యౌషధ మూలమున స్వస్థత చెంది తాను దారాపుత్రజననీ పరివారయుతుడై కృతజ్ఞుడై యున్నాడనియు నాపెను సాక్షాతుగా దేవీమూర్తినిగా జనసంఘములన్నియు సంస్తుతి గావించుచున్నారనియు, నాసాహసికురాలిని, వీరశౌర్యమూర్తిని దర్శింపనుత్సహించి

చేతవ్రోలు నేతరామానాయుడు సామాన్యునివలె వెళ్ళిదర్శించి యాపె దివ్యమంగళ సుందరవిగ్రహమును గాంచి వివాహ మాడువాంఛ వెలిబుచ్చి యనంగీకార సూచకభాషణము లాకర్ణించి నయమున, భయమున ననేకవిధములు ప్రయత్నించెననియు బట్టిబంధించి కొంపోయెదను. బలిమింపకుండగనె తన భావమంగీకరించుమని వచించెననియు నందులకా నిర్భయాత్మ దండతాడిత దందశూకంబుభంగి దండహ్యామానసికయై తీవ్రభాషాశరముల నతని హృదయేందీవరము నొగిలించెననియు, భూపతి బల్మింప నుంచెననియు జను లాబాలగోపాలము చెప్పుకొనుచుండిరి.

అపరమదయామతిపై మహనీయురాలిపై వేమనయోగీంద్రుని శిష్యురాలిపై యీలాటి ప్రయత్నము లొనరింప నీచమనియుదగదనియుదానియనుచరులేయనుచున్నారనియు, నటుజేరినజనులందఱా రాజేంద్రునిదూరసాగిరి. కొందరువీరావేశ పరవశులై యింతటి యత్యాచారముల నానీరజాక్షిపై జూపనున్న నీధారుణీశుని నిప్పుడే యేల తుదముట్టింపరాదు? దేశీయు లనపరాధుల నన్యాయముగ గొట్టు ననుచు నీపచ్చెపుమాని నిప్పుడే యేల మచ్చమాపరాదు. ఒకమహనీయురాలికి జరుగనున్న యవమానమునకై మనయందరి తనువులొరిగిన నేమి? సైన్యములులేక కొలదిబలములోనున్న నీ తులువతల దొలగించుట సులభమనియు దలంచు పలువురు జనుల పలుకులు దిశల నిండెను. ఈ వైశాఖ శుద్ధ చతుర్దశి నాడే యారాక్షసుని నరసింహుడు పొరిగొనినది. నేడింత మంది నరసింహమూర్తులుండ సహజముగా జండికామూర్తి

న్గైన యూపై కాపదవచ్చునా యని భక్తులు కలానకిచిత్తు
లై కల్కుచుండిరి.

---

## 20. వేదగిరి సంగరము.

ఆకాలములందు దైవోత్సవము లన్నియు బుడమీా శులచే నడువఁబడుచుండుటచే నయనోత్సవముగా నుండును. వేలకొలది జనులు వచ్చుచుండిరి. జనులకువలయు సరకులన్ని రకములువ రకులు దెచ్చి యంగళ్ళను బెట్టుకొని యమ్ముచుండెడివారు. సమీాపగ్రామస్థులు వచ్చి నత్సరమునకు వలయు తినుబండారాదుల విరిచికొని పోవుచుండెడివారు. ఆతిరునాళ్ళ దినములందు బదిదినము లాప్రదేశమంతయు గొన్నివందల యకరము లొక మహానగరమును మరిపించుచుండును. విశాలమయిన రాజవీధు లిరుప్రక్కల బలువిధముల దుకాణములలో నలంకరించుకొని నడయాడు వరవారవారములతోఁ బలుమారు చర్చించు దైవ నామోచ్చారణలతో వీనులవిందుగ నుండును. నరసింహజయంతిదినమున గొండపీటిసీమలోని మంగళగిరి, బేతవ్రోలు సీమలలోని వేదగిరి, విజయనగరసీమలోని సింహాచలములయందు మహోత్సవములు జరుగును.

వేదగిరి గుట్టకును నూరికిని నడుమనున్న పుడమియంతయు ననేకాంగడులతోను, బజారులతోను నొకపురమున వరలుచుండెను. పచ్చపాగాల ధరించిన రాజభటులు గావలి

గాయుచుండిరి. జనము కిటకిటలాడుచుండెను. కలపసామాను దర్వాజాలు, కిటికీలు బీరువాలు పెట్టెలు నింక ననేకరకముల పనిముట్లొకవంకసొంపుగ దీర్చియుండబడియెను. చెంచులు గట్టి కర్రలను గుట్టలు గుట్టలువేసి యమ్ముచున్నారు. ఫలము లాది తిను బండారములు లెక్కకు మిక్కుటముగ నున్నయవి నదీప్రాంతములయందు రాజోద్యోగులకు ప్రభువులకు నిర్మింపబడిన పర్ణకుటీరములు నేత్రపర్వములుగ నున్నయవి. అదె యిచ్చిన నివసించువారి కొఱకేర్పడిన పర్ణశాలలును నిండి యుండెను. రక్షకభటాలయములు కొన్ని కార్యాలయములును బూరితో నిర్మించియుండిరి.

జనులయందలజడికలిగినది. రక్షకభటులకుజనులకుఁ గర ములుఁ నరములుఁ గలియుచున్నయవి. కొట్టు-తన్ను-పొడు అను కేకలాకాశము నంటుచుండెను. కొందఱు యువతీ రత్నములును నడికట్టు కట్టుచున్నారు. చెంచుకఱ్ఱల గుట్టలు తరిగిపోవుచున్నయవి. తలయొక కఱ్ఱను లాగుకొని పోవుచు న్నారు. ఒకొక్కటి బొగెడుండును. అడ్డమువచ్చిన నాట వికులఁ బాది వెడలఁ గొట్టుచున్నారు. ఇంతలో నొకరు రెట్టింపుద్రవ్యమూ చెంచులకుఁ బారవేయుచున్నారు. ఒర లోని కత్తి లాగులోపలనే యుత్తమాంగము తుతునియలగు చున్నది. పచ్చతలగుడ్డగల ప్రతివానిబుర్రా రామకీర్తన బాడించుచున్నారు. రక్షకభటశిబిరము, రాజుగారి పర్ణశాల వేమన శిష్యురాలి యాకుటిల్లు, నింక ననేకములు తగులఁ బడుచున్నవి.

ఏమి జరుగుచున్నది? ఏమయినది? వివరములంతగాఁ

తెలియుట లేదు. పలువిధములుగాఁ బలువరించుచు భయ మందినవారు నలుగడలఁ బరువెత్తుచున్నారు. బేహారులం గడలనట్లే వదలి కాలికి బుద్ధిచెప్పుచున్నారు. పాటులు జం తెములఁ దోపుచు దిక్కులకుఁ బాఱుచున్నారు. కొన్ని కొన్నిచోట్ల శిబిరములు కాలిబంతులవలె దొర్లుచున్నయవి. వానినిగాంచి యడరి గడగడ వడంకుచు నడుగులు తడఁబడఁ బడుచు లేచుచు పరుంగిడుచున్నారు. అయ్యో! నేను రాజ పురుషుఁడను గాననుచున్నారు. రామా! హరీ! నేను భూమీ సురుఁడననువారు! బాబూ! నేను కోమటినని వంకవంక దండములఁ బెట్టి యొత్తిగిలుచున్నారు. వదలి పాఱిపోయిన వర్తకుల యంగళ్లఁ జూరగొనువారు! అన్నా! అబ్బా! అబ్బాయీ! నాయనా! నాయనమ్మ! అని యేడ్చువారు, తగిలిన దెబ్బల కబ్బబ్బాయని యంగలార్చువారు; తిట్టువారు కొట్టువారు; ఏడ్చువారునై జనులున్నారు.

వీఁడు నాశనముగానూ! ఇంతటి యపరబుద్ధియా! పాపమారూపవతి తన్నేమిచేసినది, రూపవతులంజూచిన భూపతుల కన్నెఱనగునమ్మా! చక్కనిదై పుట్టరాదు. జను లందరాపెయనిన నత్యంత గౌరవముగానున్నారు. అయిన నేమి? ఇప్పు డేమిజరుగనున్నది. అటగాంచరాదటే! మాయ గోల! ఎంతటిసాహసురాలు! దీనజనరక్షిణి – ఇంతకుఁబల్మినిఁ గొంపోయెనా! ప్రత్యక్షరావణాసురుఁడు. ఆపెనెత్తమందు శాసరాలేదట-పరివారమో-తలయొకదారి – సన్మార్గుఁడగు పాపారాయుఁడుకూడానా! పాపమాగుడిమెట్టరాజట్టివాఁడు గాఁడు. తల్లి, బిడ్డ, పెండ్లము తాను నింక వైద్యశాలయందే

యున్నారు. వారిపరివార మాతినిగుడారముకు గాపాడుచు న్నారు. ఆయన యుండినచో అతఁడేమి చేయగలఁడు. కారణ మిది యొకటేగాదటె. మనవాండ్లను దండులోనికి రమ్మని మెండుగా బాధించుటలేదా? అదికూడా తోడైనదా!

ఆ పెచాకచక్యమును జనులందఱు వర్ణించుటలో రాజా లకించి యూపెనుజూడ పటసించినదే! పోని! అంతకన్న గొప్ప వాఁడు దొరుకుతాడా! పెండ్లాడరాదా! ఇష్టముకానప్పుడు దేవేంద్రుడయినానొప్పుకొంకురా. సిరిరామోకాలొడ్డునిరాకృ త్యరాత్రే, తృణీకరించరానిదే! చంద్రమతి వేల్పుల తృణీ కరించి నలునితో నడవులందు సంతోషముతో సంచరించ లేదా! నీకేమెఱుక. వేమనశిష్యురాలేననఁటె. కొండ పిడు రాకుమారి తప్పించుకొని పోయినదట! ఆ పెగాదుగదా! ఔను ఆపెనటే! చూచియేసఁట. గుర్తించియుఁట. తగిన కట్టుబాటుగా రక్షకభటులను నియమించిన వెంటనే యూపె నైపువారు మారువేషములతో జంతపల్లి సైనికు లిటకుముం దుగానే వచ్చినారట! పోరాటమునకు దిగినారఁటె! త్వరగా రండిరా, ఆకొండప్రక్క కేగుదామని యనేకులు పరువెత్తు చున్నారు. విడివారునూ దురి మొసరించుచున్నారు. కొండ పైన దండిగా దానమొసంగిన దాతను రామారాయుఁడు చెఱఁబట్టనున్నాడని యుద్రేకపూరితులై బీదలుపాదలిందు జోక్యముగలిగించుకొని రామారాయునిని, యూతని భటులను భరతము బట్టుచున్నారు. అంతకుఁ బూర్వ ముద్యోగులచే, రక్షకభటులచే బాధింపఁబడినవారిదే సమయమని ప్రాత పగలు దీర్చుకొనుచున్నారు. జనులయందిట్లు జరుగుచున్నది.

ఔరా! ఏమి యీకల్లోలము! తల్లుల కై తల్లడిల్లుపిల్లలు,
పతులను వెదకులాడు సతులు భార్యల కై పరితపించు భర్తలు,
మనుమల కై మఱి మఱి వెదకు నాయనమ్మలును, వచ్చితి
వచ్చితి—ఇదిగో! దండము బాబో—అమ్మో యను కేకలు
నిండినవి. రాతిక్రింద రప్పక్రింద చెట్టుక్రింద పుట్టక్రింద నక్కి-
ప్రాణములు దక్కించుకొనిన వీరభటుల జనుల నెక్కిరింప
నెవరితరము. అట్టిది కన్నార గాంచినం గాని తెలియదు.
నిముసములో రసపూరిత పురవరంబు రసాభాస మయ్యెను.

కొండలక్రిందుగా గుఱ్ఱము లమ్ముకొనువారు గుడార
ములు వేసి రెండునూర్ల గుఱ్ఱముల గట్టియుంచినారు. వేర
గాండ్లు వచ్చిరి గాని నూర్లకు నూర్లు ధరలు చెప్పుచున్నారు.
ఎవరుకొందురు? అమ్ముటకు వచ్చినారా! అయిననింతటి
ధరలా! కొందరుజనులు బిర బిర జనుదెంచిరి. లగాము లూడ
దీసిరి. జీనుల నంకెముల కళ్ళెముల బెట్టిరి. ఎక్కిరి. ఒకరిని
అడుగుట లేదు. హర! హర! శంభో! యనుధ్వనులతో నుడా
యించుచున్నారు. చేతికరవాలముల శిరములు నెగుర వేయుచు
న్నారు ఇంతలో నొక స్త్రీ యా యశ్వశాల కరుదెంచెను.
నిముషములో కవచముధరించెను. శిరోవేష్టము దాల్చినది.
గుఱ్ఱమునుదట్టినది. అదినకిలించినది. ఖడ్గపాణియైదాని నారో
హించినది. కరవాలముల రెండుకరముల ధరించినది. పైకెత్తి
నది. మహిషాసుర మర్దని యను దుర్గాదేవి యేనాయీమె!
జయ్! దుర్గామహాదేవికి జై. కొండలరాజు కూతురునకు జై.
చంద్రకుమారికి జై అనుచున్నారు. ఎఱ్ఱతలపాగాలవారు
ఖడ్గహస్తులై నలుప్రక్కల గ్రమ్మియున్నారు. ఆశ్వికదళమా

వీరరసాధిదేవత నాశ్రయించి నడుచుచున్నయది. ఆశ్వికులు స్వామిదేవళమును సమీపించుచున్నారు. రామానాయండు కొలదిమంది పరివారముతో దననుజుట్టిన యాశ్వికులతో బోరాడుచున్నాడు. రామానాయండునుహయారూఢుఁడై రెండు కరములఁ గరవాలములంది శ్రీహరిచక్రము కైవడి గిర గిరఁ దిరుగుచు వైరులను నురుమాడుచున్నాడు. వీరాధివీరుఁడు వీనికిసాటి యెవరు! ఎదురెవరు! సహాయమగువారెవరు! ఒంటరి! పోటరి!

జై! చండికాకుమారికి జయ్! రాకుమారికీ జయ్! వీరకుమారికి జయ్! యనుచున్నారు. రామానాయని యెదుట మహిషాసురునికి ప్రత్యక్షమైన మహాదేవివలెఁ గానుపించుచున్నది. నాయఁడు గండ్రారఁ గాంచినాడు. మోహినీయని కేక వేసినాడు. కాదు కాదు. మృత్యుదేవతను మృత్యుదేవతనని రాకుమారి సింహనాదము చేయుచున్నది. నిన్ను వరించితి ననుచున్నాడు. నేను నిన్నే వరించితిని. ఇదుగో, సంగరభూమిని నొరుగుటకే తయారగుము అనుచున్నది. వంకర బల్లెమొకటిఁ బట్టినది. శత్రుమార్గణముఁ దప్పించుకొనుచున్నది. దానిని క్రిందుగా విసిరినది. కత్తులఁ దప్పించుకొనియది నాయనిడొక్కలో దిగినది. హరహరా! ఒరిగెను. ధరఁణిని......

—[o]—

# 21 రాకుమారి విజయము

రామానాయని దుర్ణయమున కాతనిసీమలోనివారెవ్వరును సేనలోఁ జేరలేదు. చంద్రకుమారీబాయి చింతపల్లి దుర్గాధిపతితో యోచించి చింతపల్లి వీరులను మారువేసముల నీవేదగిరికిఁ జేర్పించినది. హఠాత్తుగా దైవానుకూలమగుటచే పాపారాయనికి యొడలు వడిబడుట. సహాయపడుటచేత నాతనివారెవ్వరును రాకుమారిపైకిఁ కత్తిదూయలేదు. అటనున్నవారందఱును రాకుమారి జయమునే కోరుచున్నారు. ఇది విజయము లభించినది. చాటుగా హఠాత్తుగావచ్చిపడిన సైన్యములతో రాజు మడిసినతరువాత నిస్సంతు వానికై యుద్ధముచేయుటనవసరమని సేనానియు, మంత్రియుఁ దలచుటచేత శేతఫ్రాలు కోటయందున్న సైనికులును, విగ్రహవిముఖులగుటచేతను, వానికిసహాయముగా సైన్యములు రాకుండుటచేతను, బంధుజాలము దేశీయులందరు వానిపై రామానాయక తిరస్కారమంత్రము ప్రయోగించుటచేతను, సముద్రతరంగములవలెవచ్చుచున్న చింతపల్లి పటాలములకు మిత్రత్వమును, లొంగుట సూచించి నాయకత్వమువహించిన గురవారెడ్డికిని, వారినప్పుడే చేరిన చంద్రకుమారిగారికిని లోబడి కోట స్వాధీనముచేసిరి. రాకుమారియే స్వయముగా మంత్రి సామంతాదుల నాదరించి వీరరుద్రమాదేవి యామె రాజ్యమును స్వయముగాఁ బాలించినది. ప్రజానుకూలముగ జరించుచు జనుల యానందమున బాలుగొనుచు, బాలించుచున్నయది. అందుచే నామెను

జనులు "రాజా చంద్రకుమారీబాయి" యని బిలుచుచుందురు. ఆమె బ్రహ్మచారిణిగనే సంచరించుచు దైవప్రీతికై రాజ్య పాలన గావించుచున్నయది. పాపారాయుఁడామెకు ప్రధాన భటుఁడు—దండనాయకుఁడు.

ఆమె తనకు సహాయమైన నిష్కామకర్మాచరణ యోగ్యులైన మల్లాదినాగదేవరార్యులకు, ధూళిపాళ అమరేశ్వర శాస్త్రిగారికి వారు వలదన్నను నగ్రహార మొసంగి కృతజ్ఞత జూపినది. మహిషాసురమర్దనీ, రుద్రాంబ, రాజాచంద్ర కుమారీబాయి వంటి లలామతల్లుల, వీరరసావతారిణులఁగాంచిన మన యాంధ్రమాత స్వీయదీప్తులచే బ్రకాశించుఁగాక!

ఓం శాంతిః శాంతిః

రాజా చంద్రకుమారీబాయి యీలాగున శాసనము వ్రాయించినది. ఆ 1919 సం॥ డిసెంబరు 12 వ తేది శుక్రవారమునాటి యాంధ్రపత్రికయందు ముద్రితభాగమును జత పఱచుచున్నాము.. ...............ఇది యన వేమారెడ్డి తనూజ చంద్రకుమారీబాయి మల్లాది నాగదేవరార్యులకు ధాన్యవాటీ (గుంటూరుజిల్లా ధరణికోట, అమరావతి) పరిసరబ్రాహ్మణాత్మకూరు గనాత్కూరు అగ్రహారముగా నొసంగియున్నది. ఆ శాసనభాగమును తిలకింపుడు. శ్రీమహారాజ అనవేమారెడ్డి ఛత్రపతి భూపాలః 68 సం॥ శ్రీకుమార వేమారెడ్డి భూపాలహః 35 సం॥ రెడ్డవారిది బసవశంకర బిరుదు శ్రీస్వస్తి జయాభ్యుదయశాలివాహన శకవర్షంబులు 1315 వ ర్రమాన వ్యవహారిక చాంద్రమానేన శ్రీముఖనామ సంవత్సర వైశాఖ శు॥ పౌర్ణమీ సోమవారం చంద్రగ్రహణం-

శ్రీ మద్రాజాధిరాజ అనవేమారెడ్డి ఛత్రపతి రాజా నామః భూదాన అగ్రహార సంకల్పాః శ్రీమద్యజన యాజన యధ్యయన అధ్యాపక దానప్రతిగ్రహ షట్కర్మ నిరతులైన, హరితసగోత్రోద్భవులైన ఉద్దండకోలాహల మల్లాది నాగదేవ రార్యః చతుర్వేదషట్ శాస్త్రపండితులంగారికి రాజా చంద్రకుమారీబాయిగ్రహదయ చంద్రగ్రహణ పుణ్యకాలే కృష్ణవేణీ మహానదీ ..... బ్రాహ్మణాత్మకూరు...... అమరేశ్వరార్పితముగ యిచ్చెను. ఈమల్లాది నాగదేవ రాయ్యల వంశజః లిప్పుడాయూర గ్రామాధికారులై యున్నారు. ఈ శాసనమందే ధూళిపాళ అమరేశ్వరశాస్త్రిగారికి 15 కతుల భూమియు, గిండూరు ఎదురుశాస్త్రిగారికి 10 కతుల భూమియు నొసంగబడినది. కతియనగా 17 యకరములు. పూర్వము ఉద్దండకోలాహలయను బిరుదుం గొనని విశ్వసించ పలయును.

మహాసీయుల చరిత్రములు కర్ణపుట పేయములుగదా. అందుచే దేశోద్ధారకులు విశ్వరూపుండగు విరాట్పురుషుని ప్రత్యక్ష సేవకులగుటచే ముకామ్యులగుట, వారిధ్యానము మనల సన్మార్గమునకు దిప్పుననుటలో వింతయేమున్నది!

ఓం శాంతిః శాంతిః

ఓం తత్సత్

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

పుస్తకములు వలయువారు :

మాధవపెద్ది రామకోటయ్య,

బ్రాహ్మణకోడూరు.

గుంటూరు జిల్లా.

